ప్రథమ ముద్రణ : 1000 ప్రతులు
ఆగష్టు 1978


వెల రు : **7-00**

ప్రతులకు :

ఎఫ్. రవి బాబు
C/o కె. సిహెచ్. నరసయ్యగారు,
న్యూస్ ఏజంట్ అండ్ బుక్ సెల్లర్స్
కస్పాబజార్ - ఖమ్మం.

ముద్రణ :

శివనిర్మల్ ప్రింటర్స్, గాంధీచౌక్ - ఖమ్మం.

# అభినందనాశీర్వాదములు

నీవు రసప్రియుండవ వనిన్ రసవంతములై ప్రసన్నమై
చేవగలట్టి సత్కృతులచే విలసిల్లుచు నుంటివీవు శి
ష్యావళిలోన నగ్రజుఁడవంచు దలంచుచు నుందు నిన్ను, సీ
తావిభుఁడిచ్చుఁగాత బ్రమదంబుగ నీకుఁ జిరాయురున్నతుల్.

—రా. సు. రాట్కవి,
ప్రసన్న భారతవ్యాస

నామములెన్నియో కలవు నాటికి నేటికి వాటిలోన నీ
నామము శ్రేష్ఠమై మొదటినామముగా విలసిల్లె కేశవా!
నీ మధుర ప్రసన్న కమనీయ కళాకవనమ్ము గూడ భా
షామణి చల్వతో నెగడి శాశ్వతమై పొగడించు ధాత్రిపై.

—జగజ్జనని వేదాంతకవి,
కవితారాజధాని - కొవ్వూరు

చారుపదాంచితంబునయి శ్రావ్యమునై రసవత్తరంబునై
సూరిమనోహరంబునయి శుంభదలంకరణాన్వితంబునై
భూరిసలక్షణంబునయి పొల్చెడు కైత గలట్టి కేశవా
వారికి చెల్లునంచు రసప్రియ యన్ బిరుదంబు నిచ్చితిన్.

—కవిసింహ పోకూరి కాశీపత్యవధానులు,
త్ర్యర్థికావ్య నిర్మాత

# అభినందనాశీర్వాదములు

నీవు రసప్రియుండవ వనిన్ రసవంతములై ప్రసన్నమై
చేవగలట్టి సత్కృతులచే విలసిల్లుచు నుంటివీవు శి
ష్యావళిలోన నగ్రజుఁడవంచు దలంచుచు నుందు నిన్ను, సీ
తావిభుఁడిచ్చుఁగాత బ్రమదంబుగ నీకుఁ జిరాయురున్నతుల్.

—రా. సు, రాట్కవి,
ప్రసన్న భారతవ్యాస

నామములెన్నియో కలవు నాటికి నేటికి వాటిలోన నీ
నామము శ్రేష్ఠమై మొదటినామముగా విలసిల్లె కేశవా!
నీ మధుర ప్రసన్న కమనీయ కళాకవనమ్ము గూడ భా
షామణి చల్వతో నెగడి శాశ్వతమై పొగడించు ధాత్రిపై.

—జగజ్జనని వేదాంతకవి.
కవితారాజధాని - కొవ్వూరు

చారుపదాంచితంబునయి శ్రావ్యమునై రసవత్తరంబునై
సూరిమనోహరంబునయి శుంభదలంకరణాన్వితంబునై
భూరిసలక్షణంబునయి పొల్చెడు కైత గలట్టి కేశవా
చారికి చెల్లునంచును రసప్రియ యన్ బిరుదంబు నిచ్చితిన్.

—కవిసింహ పోకూరి కాశీపత్యవధానులు,
త్ర్యర్థికావ్య నిర్మాత

# అంకితము

త్ర్యర్థికావ్య నిర్మాత

మహాకవిశేఖర కవిసింహాద్యనేక బిరుదాంచిత

మాజీ విద్వద్గద్వాల ఆస్థానకవి

స్వర్గీయ

బ్ర॥ శ్రీ॥ పోకూరి కాశీపత్యవధానులవారి

చిరస్మృతికి

కయితలఁ గడుపారఁగన్న కాశీపతి
గురువరేణ్య ! నీదు చరణములకు
అంజలి ఘటియించి "అమరస్మృతులు" నీకు
నంకితముగ నిడితి నందుకొనవె !

# అంకితము

త్వర్థికావ్య నిర్మాత
మహాకవిశేఖర కవిసింహాద్యనేక బిరుదాంచిత
మాజీ విద్వద్గద్వాల ఆస్థానకవి
స్వర్గీయ
బ్రి॥ శ్రీ॥ పోకూరి కాశీపత్యవధానులవారి
చిరస్మృతికి

కయితలఁ గడుపారఁగన్న కాశీపతి
గురువరేణ్య ! నీదు చరణములకు
అంజలి ఘటియించి "అమరస్మృతులు" నీకు
నంకితముగ నిడితి నందుకొనవె !

# స్మృత్యంజలి

సీ॥ విద్వత్కవీంద్రులు వినుతించ త్ర్యర్థి కా
వ్యము వ్రాసినట్టి నీపటిమ పటిమ
అపురూపముగ పదియక్కరంబులతోడ
కబ్బమల్లిన నీదు గరిమగరిమ
అచ్చతెన్గున నిరోష్ఠ్య ప్రబంధంబును
కృతి గూర్చినట్టి నీ ప్రతిభప్రతిభ
పద్యంబు నొకటి ముప్పది యర్థములతో నె
సంగ వ్రాసిన నీదు శక్తిశక్తి
సిద్ధయోగిచరిత్ర నృసింహ విరస
నస్తుతి ప్రముఖముల జనంబులెంచు
పగిది రచియించినట్టి నీ ప్రజ్ఞప్రజ్ఞ
సుకవితారంహా! కాశీపతి కవిసింహా!

సీ॥ కావించు కొంటివి కనకాభిషేకంబు
హనుమత్ప్రభుని చేత హోలహర్వి
పట్టించు కొంటివి బ్రహ్మరథమ్మును
శిల్పి బ్రాహ్మణులచే సిద్ధిపేట
వేయించు కొంటివి విప్రులచే ఘంటి
కాకంకణాల్ చిన కండ్లకుంట
తొడిగించు కొంటివి తోడాను కాలికి
పురజనాగ్రణులచే ప్రొద్దుటూర
నెన్నుపై వారివలన నూరేగినావు
మకరకుండల కేయూర మంజుపతక
ముల నెనసినట్టి విన్నెన్న నలవియగునె
దివ్యతరసౌఖ్య! కాశీపతి గురుముఖ్య!

సీ॥ పెదవి విప్పినచాలు కదలించు హృదయాలు
పదపదంబందు నీ భావపటిమ
కంఠమెత్తినచాలు గంగయై పొంగారు
ఔరా ! యనంగ నీ ఆశుధార
పలుకరించినచాలు పులకలెత్తించును
కులుకు లొల్కించు నీ తెలుగుకవిత
చెలిమి చేసినచాలు కలిమి బలిమిగూర్చు
పరికించినంత నీ ప్రౌఢరచన
అద్భుతముగొల్పు నీత్రివిధావ ధాన
వాణియును చిత్రకవితలు వర్ణనములు
ఇంతయేయని పొగడ నేనెంతవాఁడ
దివ్యగుణసాంద్ర ! కాశీపతి కవిచంద్ర !

మ॥ కవులెల్లన్ వినుతించుకై వడి మహోద్గ్రంథంబులన్ వ్రాసి, అ
త్యవలీలన్ త్రివిధావధానముల జేయంజాలి, అత్యంత గౌ
రవ సన్మానములంది, పెక్కుబిరుదుల్ రమ్యక్రియన్ బొంది తా
భువినీశక్తిగణింప శక్యమగునే ? పోకూరి కాశీపతీ !

మ॥ అహ్హరా ! కావ్యము వ్రాయుచే ఘనమికన్ ద్వ్యర్థిప్రబంధంబు సం
స్తవనీక్రియ పండితుల్ కవులు విన్ శ్లాఘింప నేరీతిగా
నవభావైక రసాస్వదంబగు గతిన్ గల్పించితౌ బాపురే !
భువినీకావ్య పటుత్వమెన్నవశమే ! పోకూరి కాశీపతీ !

ఉ॥ ఉబ్బసమైన వాగ్ఝరి మహోజ్వలమై ప్రవహించు, అబ్ధముల్
డెబ్బదిదాటిపోయిన పరింతువు కళ్లకు జోడులేక, మేల్
కబ్బములల్లుటందు మనగాడవయా కవితా ధురీణ ! మే
మబ్బురమొందకుందుమె మహాకవిశేఖర ! కాశికాపతీ !

చ॥ క్రవనము పుట్టినప్పటి లగాయతు నేటికి లేనియట్టి స
త్కవిత దశాక్షరీయముగ గ్రంథము వ్రాసిన దిట్టవీవు సం
స్తవ మొనరింపగా దగిన త్ర్యర్థి యనందగు కావ్యకర్త వై
తివి కవిసింహ ! నిన్ను వినుతింపగ శక్యమె మమ్మబోంట్లకున్.

గీ॥ లక్ష్మిలోబడె నీదు వాగ్లక్ష్మి కహహా !
కానిచో కనకాభిషేకముగ మారి
పిదప కాళ్ళట్టునే గండపెండరమయి
అత్త కోడలికే లొంగనాయె నిచట !

గీ॥ సరసులను వంచజూచు చంచలుల భంగి
అబ్బినను జుట్టు నబ్బని యపుడు కాళ్ల
బట్టెదరటన్న సామ్యమీపట్ల నిక్క
ముగను గనుపించె కాశీపతి గురువర్య !

కం॥ ఆరోజుల రాజులచే
నీరాజన మందినావు నేర్పరివై, నీ
వీరోజుల సన్మానమ
హో ! రాధాకృష్ణచేత నొందితివికదా !

ఆ॥ భువిని పూజలెన్ని పొందిన నీకింత
తృప్తి గల్గకుంట దివికినేగి
అచట గౌరవముల నందితివేమేమి
తెల్పవైతినాకు దివ్యచరిత!

కం॥ లోకముననెచటికేగిన
నాకు నెరింగించుచుంటి నాపయి ప్రేమన్
నాకింత దెల్పకుండగ
నాకమునకు నేగినావ నాగురుదేవా !

కం॥ మా రాకకు జతగాడవు
నీతో చనువుంట "నీవునీవ" ని నీతో
రీతివిడి వాడాడితి
నాతప్పు క్షమించినావ నా గురుదేవా !

ఆ॥ నేను మెత్తబడితి నీకొసంగిన చమత్
కృతిని అచ్చువేసి అతులకీర్తి
అందుకొనుము కేశవాచార్య శీఘ్రమే
యనుచు దెల్పి దివికి నరిగినావు !

చ॥ ననుకవిపోషకుండనుచు నాపయి మక్కువనొల్కబోసి మ
న్నన గృతి నాకొసంగిన ఋణమ్మది తీరునె జన్మజన్మలన్
విను గురుపూజలన్ దనుపనేర్చినగాని మహాకవీంద్ర ! వం
దనములు సేతు తావకపదంబులకేన్ మనసార భక్తితోన్ !

కం॥ గురుఁడవు సఖుఁడవు కవితా
గురుఁడవు తాత్విక విచారఘోరాటవిలో
దరిజూపు విజ్ఞుడవు మా
తరతరతర తరతరాల తాతవయారే !

ఆ॥ కవన భువనములకు కాశీపతివటంచు
కృతిసమర్పణ మొనరించునపుడు
నీ పదాలఁ గడుగ నా పదాల నమృత
మొలకలేక కనుల జలములూరె.

కం॥ కవితా చిత్రము లెన్నియొ
వివిధ కళారుచుల వెన్నొ వివరించిన ఓ
కవితానిధి ! కాశీపతి !
నవరసపాదోధి ! నీకు నతులర్పింతున్ !

# అంతరంగావిష్కృతం

భిన్న సన్నివేశాల్లో, రకరకాల బహుముఖాల మానసిక స్థితిగతుల్లో కేశవాచార్య కవిగారు పొందిన అనుభూతులకు ఆకృతులు ఈ కృతులు.

వృత్తం గేయం, వచన కవిత ముప్పిరిగొన్న కవితా సంపుటి ఇది. కవి అర్థగణాంకశాఖలో ఆఫీసరు. లెక్కలతో ఉక్కిరిబిక్కిరయ్యే వృత్తి. కానీ ఆ గణాంకాల రణగొణ ధ్వనులలోనే కవితా గుణాలంకారాల కమనీయ వీణను పలికించడం ఇతని రసవృత్తి.

"భావుకాంధ్రమనెడి పచ్చని తోటలో
ప్లానులనెడి నీరు పారుచుండ
శ్రీ గణాంకవల్లి చిగురించి పుష్పించి
ఫలము లీయకున్నె భవ్యగరిమ"

సాధారణ చక్షువులకు శుష్కంగా కనిపించిన వస్తువు ఈతని దృష్టిలో పుండ్రేక్షువుగా భాసించింది. ఇదే కవి చేసేపని.

ఈకవిలో సౌందర్య దిదృక్ష ఎంతగా ఉందో సందేశదృష్టి అంతగాఉంది.

"చిత్తమనెడి ప్రమిదలోన - స్నేహమనెడి ఘృతము నింపి
త్యాగమనెడి వత్తిని అను - రాగముతో వెలిగింతును."

ఇది త్యాగారాధన తత్పరత.

"వసుధైక కుటుంబమనీ
పసిడి కలలు కనీకనీ
కొసకు గగన కుసుమమనీ
కోరికలను చంపుకొనీ
మూగనోయినది మానవత
మోసపోయినది మా జనత"—

సమకాలీన సమాజంలోని నిష్ఠురసత్యాన్ని అసిధారానిశితంగా ప్రకటించాడు కవి. సామాజిక చైతన్యాన్ని ప్రబోధించే కవితల్లో ఈ కవి రసావేశం బాగా పదును దేరింది. పద్యప్రీతిని చంపుకోవలసిన అవసరంలేకుండ వీరు ఆధునిక ఛందంలోనూ ముక్తచందంలోనూ ప్రగతిమూలక రచనలు చేయగలుగుతారన్నది ఈ కృతి చాటుతూనే ఉన్నది. కేశవాచార్యులుగారి కవితాప్రతిభ ఇంకా ఇంకా తీగసాగాలని ఆశిస్తున్నాను.

29–4–74

సి. నారాయణరెడ్డి.

# ఆనంద తరంగము

నా స్నేహలతా కవితా సంఘసహస్ర సభ్యులలో చి॥ కేశవాచార్యకవి ముఖ్యుడు లోగడ నేను జటప్రోలు సంస్థానకవిగా నున్నప్పుడు. నావద్ద చదువుకొన్న శిష్యకోటిలో నితడు నాకు ప్రియశిష్యుడు, హితుడు, ఆత్మీయుడు. ఇతడు నిరాడంబరజీవి, సహృదయుడు, ఉన్నతాశయములుగల వ్యక్తి. ఇతడెంత దైవభక్తి కలవాడో అంత కవితాశక్తి కలవాడు. ఇతనికి ఉర్దూ హిందీ పార్సీ ఇంగ్లీషు మొదలగు భాషలలో పరిచయ పాండిత్యములున్నవి. చిన్నవయసునుండియే చక్కని కవిత్వము వ్రాయనేర్చిన సహజకవి.

ఈకవి కవితారసప్రియుండని రసజ్ఞులకుఁ దెల్లమే. ఇతడు పద్యము గేయము రెండునుం జాల చక్కఁగా వ్రాయగల డిట్టయని ఈకృతి ఋజువుచేయుచున్నది. ఇతని కవిత్వము ధారాశుద్ధి భావనాపటిమ కలిగి నిర్దుష్టమై, లలిత పదప్రయోగ శోభితమై రసప్రపూర్ణమై ద్రాక్షాపాకమునఁ దనరుచుండును. ఇతడొక మధురకవి.

మాత, మాతృభూమి, మాతృభాష. యీ మూడింటియం దభిమానము మక్కువగా గలవాఁడని యీకృతి సాక్ష్యమిచ్చుచున్నది. ఇది ఖండకృతి. ఇందలి ప్రతిఖండిక ఒక రసగుళిక. చదివిన కొలఁది చదువవలెనను ఉత్కంఠను రేకెత్తించును. క్రొత్త పోకడలతో ఉదాత్త భావములతో మృదుమధుర పదజాలముతో కవితా కౌశలముఁ బ్రకటించుచు హృదయంగమముగ రచింపఁగల నేర్పు కూర్పుఁగాంచిన ప్రౌఢకవి ఇతడు. ఇతని సీసములు ముద్దులు మూటగట్టునట్లుండును. వృత్తములు సొగసులు నింపునట్లుండును. ఇతని పద్యము హృద్యంగమము. ఇతని గేయము శ్రవణపేయము ఇట్టి మనోహరములగు కృతులింకను రచించుఁ శక్తి మా కేశవునకు శ్రీ కేశవుఁ డనుగ్రహించుగాక! పట్టభద్రుఁడై పెద్దయుద్యోగ పదవిలోనున్నను మాతృభాషాసేవను నిరంతరము జేయుచున్న యీ కవిరత్నమునకుఁ జిరాయురారోగ్యభాగ్య శ్రీలు గలుఁగుగాక!

ఇట్లు
బుధజన విధేయుఁడు
రా. సు. రాఘవాచార్యులు... 

స్నేహలతా కవితా సంఘం
మహబూబ్‌నగర్
27-5-19 8

# పరిచయ పీఠిక

శ్రీ కేశవాచార్య కవిగారు రసప్రియ సాహితి బిరుదాంకితులు నాకు చిర పరిచితులైన కవిమిత్రులు. నైజాము రాష్ట్రములో పాఠశాలలందు తెనుగు చదువు కొనుట కవకాశములేకున్నను బాల్యమునుండి తెలుగు భాషాప్రియులగుటచే స్వయంకృషితో తెలుగునభివృద్ధి చేసికొన్నారు. మెట్రిక్యులేషన్ వరకు ఉర్దూ మీడియంలో చదివి ఆంగ్లములో అర్థికశాస్త్రం తీసికొని పట్టభద్రులైనారు. వీరిది సహజపాండిత్యము. విద్యార్థిదశలోనే ఆంధ్రప్రదేశ్ అవతరణకు ముందు తెలుగురాకున్న మనకిక తెగులెసుమ్మ" అను మకుటంతో అనర్గళంగా పద్యాలు చెప్పి తెలుగుజాతి సమైక్యతకై గళమెత్తిన కవికిశోరమితడు. వీరి కవితా వ్యాసంగమును పరిశీలించి వ్రాసిన "కవిపరిచయము" అను నా వ్యాసము ఆంధ్ర భూమిలో ప్రచురింపబడినది. (తేది 19-12-1971)

ఈకవి సరసుడు. తన కవితా వ్యాసంగమునకు ఉద్యోగరీత్యా తగు వాతావరణము లేకపోయినను

"నా కవిత్వము వినువారు లేకయున్న
చింతయేలేదు నాకు రవంతయైన
వాయుడోలలనూగు చోహోయటంచు
పైరు దొరసాని మెచ్చె నొయ్యారమొలక"

అని తాను పంటల సర్వేనిమిత్తం పొలాలకు వెళ్ళినప్పుడు లోలోన కావ్యగానం చేసుకొనేవారు.

"శ్రీగణాంక మాత నాగణాల్గలకైత
తగవులాడ మనకు తగదటంచు
మైత్రి చేసికొనియె మరియట్లు గాకున్న
గణిత కవిత లెట్లు కలిసి సాగు".

అర్థగణాంకశాఖలో ఉద్యోగము. ఇంతచక్కని కవిత్వ మెట్లబ్బినదని ప్రశ్నించే కవిమిత్రులకు పైపద్య మప్పజెప్పి "గణిత నావృత్తి - కవిత నా ప్రవృత్తి"

అని సహసోక్తితో సమాధానమిస్తారు తన సహజ కవితా తంత్రులను మీటుతూ కవిగారు గణాంకవీణలో ప్రణాళికా గీతిని వినిపిస్తారు.

"నా గణాంకభేరి మ్రోగెనా దిగ్గున
నిదుర మేలుకొనును నిఖిలజగము
నాగణాంక చేతనాజ్యోతి రగిలెనా
ప్రకృతి నవ్వినట్లు ప్రగతి విరియు".

ప్రణాళికా గణాంక శాఖాధికారిగా పనిచేస్తున్న శ్రీ కవిగారిట్లు వ్రాయడంలో ఆశ్చర్యంలేదు. అర్థగణాంకశాఖ తరపున ప్రసారితమైన వీరి రేడియోప్రసంగం వినే అవకాశం నాకొకప్పుడు కలిగింది వీరు కవితారంగంలో ఎంత సరసులో ఉద్యోగరంగంలో అంత సమర్థులు కార్యదక్షత కలవారు.

ఇందలి 'ప్రియలేఖ' కవిగారి రసహృదయంలో కలమద్ది వ్రాయబడ్డదా అని అనిపించును.

"ప్రియసఖీ! నీవియోగ మప్రియమె అయిన
ఎంత వెచ్చన! యెద ద్రవియించి పోయి
ఘృతముగాగ నీ మధుర సంస్మృతి రగుల్చు
చేతనాజ్యోతిలో నిన్ను జూతుగాదె!"

చేతనాజ్యోతి ఎప్పుడూ రగులుచుండవలె. అందులో చేతనావధువు (అనుక్షణము కనిపిస్తూ కవిని విడువపోనీక నవత్వమునకై ప్రేరేపించవలె. అట్టి నవత్వమనెడి ప్రియురాలివియోగము దుస్సహము అందుకే కవిగారంటారు.

"నా ప్రణయసఖీ! నాచేతనావధూటి! నీవియోగ వీధిలో నింగి నేల కానరాకుండె."—

"నీవియోగాగ్నిచే గుండె నీరుగాగ-మధురనయనార్ద్ర బాష్పవారిధులునిండి తాపమొక్కింత చల్లారతాళుమంటి - కాకపోయిన ఘడియలు గడువగలనె?"

వీరిది సాంప్రదాయ కవిత్వమైనా రెండంచుల కత్తివలె పద్యము గేయము చక్కగా వ్రాయగల కవి. వీరిపద్యము హృద్యంగమమై గేయము శ్రుతిపేయమై పరిఢవిల్లును. వీరి రచనలలో విశ్వజనీనత గోచరించును. దైవభక్తి దేశభక్తి జాతిసమైక్యత సర్వమానవ సౌభ్రాతృత్వము వసుధైక కుటుంబము అను

మహోన్నతాశయము లేకవి కలములో గళములో మధురస్మృతులై వినడించు చుండును. ప్రగతి మూలకములైన విజాతీయ భావములుకలవి ఎన్నో ఇందిక లిందు కలవు. గ్రంథ విస్తరభీతిచే ఇందలి కొన్నిపంక్తులు మాత్రమే మనవి చేస్తాను.

సు ప్ర భా త గీ తి

"పులియావులొకచోట జలముగ్రోలిన భాతి
జాతివైరము లేని నీతినరసి
వింగి నేలనుదాక వంగివచ్చినరీతి
కలవాడు నిరుపేద చెలిమిగోరి"

... ... ... ...

"దాస్య దారిద్ర్యాది దావానలము నార్ప
శ్రామికస్వేద వర్షమును గురిసి
మానవత దిక్కులకు చాటి మంచిపెంచి"

ఎంత ఉదాత్త భావములివి !

వి శ్వ ఘో ష

ఓ అసూయా ! ఓ గర్వమా ! ఓ స్వార్థమా ! అని సంబోధిస్తూ—

"ఏల శాంతిలేక ఏడ్చెదరే మీరు
మానవత్వమనెడి మందుదినక"

అంటూ తరతరాలనుండి కరడు కట్టుకపోయిన మనిషిలోని అవగుణాలనుగర్హిస్తూ మానవతావాదమును బలపరుస్తారు. తిండి, గుడ్డ, వైద్యం, ఉద్యోగం మొదలగు వాటిలో స్వయం సమృద్ధి సాధనకై తపనపడుతూ

మూర్చిలినది మానవత నిట్టూర్చెదేల ?
ఓ ప్రణాళికా వ్యూహమా ! ఓ పురోగతి !
ఓ నవత ! ఓ యువత ! ఓ నవోదయంబ !
తేరె చైతన్య సంజీవి తేరుకొలుప !

అని చైతన్యగళమెత్తి పురోగతికై పిలుపునిస్తారు. ప్రణాళికారంగాన్ని అభివృద్ధి పరచినగాని ఆర్థికప్రగతిని సాధించలేమని కవిగారి భావము.

ఇక గుండెలకు హత్తుకుపోయే గేయపంక్తులు చూడండి

అద్వైత గీతి :

" అన్నదమ్ములెందరైన కన్నతల్లి ఒకటేరా !
మతం కులం వేరైనా మాతృదేశమొకటేరా !
జన్మభూమి కన్నమిన్న స్వర్గసీమలేదురా !
స్వాతంత్ర్యం కన్నమిన్న సౌభాగ్యం లేదురా !"

దివ్వెల నవ్వులు—

" అహంవల్ల అంధుడనై
అద్దంలో చూడలేను
స్వార్థంతో సమతలోని
సౌందర్యం గాంచలేను. "

తెలుగు ఉగాది.—

" వేపపూవులో చేదును విరచే
తీపిని కలిపిన పచ్చడికోసం
ద్వేషాగ్నులు చల్లారగ కురిసే
ప్రేమ సుధారస వర్షంకోసం...
పలవరించినది మానవత !
కలవరించినది మా జనత !

నవత యువత మానవత కలిసిన త్రివేణి సంగమువలె వీరి కవితా స్రవంతి ప్రవహించును

చక్కని ధారాశుద్ధి కలిగి భావస్ఫోరకమై ప్రవాహంలా సాగిపోతుంది వీరి కవిత్వం. వీరిది మేలుకొలిపే కవిత్వం. జోకొట్టేదికాదు. భావస్పష్టత పదలాలిత్యం వీరి కవిత్వంలోకల ప్రత్యేకలక్షణాలు. అందంగా ఊహించటం అందంగా చెప్పటం అల్పపదాలలో అనల్పార్థం పొందుపరచటం వీరి సహజ కవితాకౌశలం. చొరవలేమిచే వీరింతకాలం మరుగునబడ్డ మాణిక్యమైనారు. తగు ప్రోత్సాహం తగు వాతావరణం లేకున్నను నిరంతరం ఉద్యోగధర్మములో నిమగ్నులై యున్నను తమకు దైవప్రసాదముగా ప్రాప్తించిన సహజ కవితాభిరుచిని చంపు

కొనకుండ శ్రీ కేశవాచార్య కవిగారు చేయుచున్న అకుంఠితమైన సాహిత్యకృషి ప్రశంసనీయమైనది. వీరి అముద్రిత కృతులన్నియు త్వరలో వెలుగులోనికి రావలెనని ఆశిస్తాను.

" విశ్వశ్రేయః కావ్యం " " నానృషిః కురుతే కావ్యం "

అని నానుడులు కలవు. కవులు జాతిరత్నాలు. లోకాన్ని తనకు ఋణపడేలా చేస్తాడు కవి. కవిని లోకమెప్పుడు విస్మరించలేదు. విస్మరించబోదు. బాహ్యాంధకారాన్ని మాత్రమే పోగొట్టకలడు రవి. మనఃకుహరములందు క్రమ్ముకొన్న కారు చీకట్లను పోకార్చగలవాడు కవి. మహాకవులకోవకు చెందిన కీర్తిశేషులైన కవిసింహ పోకూరి కాశీపతి అవధానులవారి చిరస్మృతి చిహ్నంగా శ్రీ కేశవాచార్యులవారు తమ " అమరస్మృతులు " అను ఖండకావ్యాన్ని వెలయించడం యెంతయు హర్షదాయకము. శ్రీ ఆచార్యులవారు ధన్యులు. అభినందనీయులు.

చక్కని కవితాకౌశలము భావనాపటిమ మృదుమధురశైలి ధారాశుద్ధి రససిద్ధి గల శ్రీ కేశవాచార్య కవిగారు ఇంకను అనేక సత్కృతుల రచించి తెలుగు భాషామతల్లికి అభినవాలంకృతులు చేకూర్చవలెనని ఆశిస్తున్నాను.

కవిరాజ సాహితీ సదనం,
శ్రీనివాస కాలనీ-హైదరాబాదు

త్రిపురనేని సుబ్బారావు
25-6-1?18

# సుప్రభాతగీతి

జియపెట్టరా! జయజయ నినాదాలతో
గగనాన జెండాను ఎగురవైచి
కైమోడ్పురా! మస్తకమువంచి తల్లి భా
రతికి నీ గుండె హారతిగ నిచ్చి
గళమెత్తి విశ్వమంగళగీతి పాడరా!
భ్రాతృభావైక విపంచి మీటి
వ్రాయరా! మానవత్వము జిందు కావ్యము
ప్రతిపదంబున ప్రేమ రసము నింపి

చాటరా! నీ మహోజ్వల జాతి గౌర
వోన్నతుల దిగ్దిగంతాలహోయనంగ
భవ్యగుణగాత్ర! పరమపావన చరిత్ర!
విశ్వజనమిత్ర! భారత వీరపుత్ర!

జాతి సమైక్యతా సంరక్షణార్థమై
కులమత భేదాల కూలగొట్టి
పాషాణమందు పీయూషము పుట్టించి
దనుజుని మనుజుగా తగనొనర్చి
దాస్య దారిద్ర్యాది దావానలము నార్ప
శ్రామిక స్వేద వర్షమును గురిసి
దీన మానవతతి దిక్కయి మొక్కయి
అసమతాక్రమణల నణగద్రొక్కి

మానవత దిక్కులకు చాటి మంచి పెంచి
మాతృ దేశోన్నతికి నయి మధుర మంగ
ళాక్షరార్చన తోడ సౌహార్దగీతి
పాడరా! సోదరా! సుప్రభాతగీతి!

పులిఆవు లొకచోట జలము గ్రోలినభాతి
జాతి వైరములేని నీతి నరసి
నింగి నేలనుదాక వంగివచ్చిన రీతి
కలవాడు నిరుపేద చెలిమినెంచి
సెలయేళ్ళు బీళ్ళ శ్యామల మొనర్చిన మాడ్కి
భాగ్యవంతుడు పేద బాగుగోరి
వసుధపై మేఘుడు వర్షించినట్లుగ
దీనులపై జాలివాన గురిసి

నీరు పల్లపు నేలపై పారు తీరు
పతితతతి కయి త్యాగ తత్పరత జెంది
సమహితత్వంబు పాటించి జాతికొఱకు
పాడరా! సోదరా! సుప్రభాతగీతి!

భరతజాతి సమైక్యతా భావకిరణ
భానుడుదయించి చీకట్లు బాఱద్రోలు
గాక! స్వాతంత్ర్య దినమందు కంఠమెత్తి
పాడరా! సోదరా! సుప్రభాతగీతి!

స్వప్రయోజనపరులు నిశాచరులయి
డాపుడుందోపుడుల సమిధలను గూర్చి
దరల మంటలు మింటికిన్ దాకిప్రాక
జాతి మారణహోమము సలిపినారు!

నీతిని నీటముంచి అవినీతిని పెంచి స్వలాభమెంచి సౌ
భ్రాతృత ద్రుంచి మానవత భస్మముగా నొనరించి జాతి సం
ఘాత కిరాతకుల్ కరువు కాటకముల్ రగిలింత్రు లెమ్ము! నీ
మాతృ ధరిత్రికై నిదురమానుము భారత వీర సోదరా.

ద్వేషముతోడ ద్వేషమును ద్రెంచగలేమెవుడైన ప్రేమ పీ
యూషము దానిపై కురియకుండినచో – సహజీవనైక్య స
ద్భూషణ! లెమ్ము! నీ సహనమున్ దహనమ్మొనరించకుండ వి
ద్వేషము మాని కూర్మి కురిపింపుము శాంతి చిగుర్చు ధాత్రిపై!

దేశము తల్లివంటిది విదేశము భ్రాతృసమంబు విశ్వసం
దేశము నీదు ధ్యేయమయి దేశసమస్తజనాళి దుర్భర
క్లేశము బాపి మ్రోదులిగురించెడి శాంతి సమైక్య జీవనో
ద్దేశము నీది నిన్గనిన దేశమదెంతటి పుణ్యభూమిరా!

పులులును గోసమూహమును ముంగి భుజంగము లొక్కచోటనే
చెలిమి మెలంగు చందము వసింత్రు పరస్పర మైత్రితో జనుల్
కులమత జాతివైరముల కూలగ ద్రొక్కి సమైక్యభావసం
కలితమనస్కులై – భరతఖండ మదెంతటి పుణ్యభూమియో!

ధర్మయుద్ధమునకు దండయాత్ర వెడల
ఉదధి గట్టవచ్చె ఉడుతగూడ
ఆక్రమణము ద్రుంచ అసువులడ్డుపెట్టి
రాక్షసు నెదిరించె పక్షిగూడ

నీదు మహత్త్వమున్ బొగడ నేరుపు చాలదుపో రనాకు నీ
పాదరజమ్ము సోక శిలభామినియయ్యె – హలాయుధుండవై
స్వేదపు బిందువుల్ నుదుట చిందుము బీళ్ళు ఫలించు ప్రోళ్ళ పు
ష్పాదులచే చిగుర్చు నవభారత పుత్ర! స్మరింపు పూర్వమున్.

'అక్షరార్చన' ఆకాశవాణి హై.
సౌజన్యంతో

# దివ్యస్మృతి

గీతాపయోధి సంభూత లక్ష్మి కటా
క్షమ్ము సాధించు దీక్షాగుణమ్మె
పీడిత ప్రాణి కాన్పించ గుండె ద్రవించి
జాలయి వారెడు జాలి గుణము
ఒకచెంప గొట్ట వేరొక చెంప జూపించి
శత్రు విజయమొందు సహన గుణము
నీవు నేనను భేద భావంబు సమయ న
ద్వైత మందలి సమభావ గుణము

సత్యము నహింస వీడని సద్గుణమ్మె
జన్మతో వచ్చినట్టి భూషణములగుట
నీవు పురుషోత్తముడవు గాంధీమహాత్మ!
నీ స్మృతి హృదయ కమలాల నిలుచుగాత!

భూతలంబున నిండు పున్నమి వెన్నెల
పూచినట్లొప్పెడు బోసినవ్వు
పేదప్రజా ప్రతిబింబమై మూడు లో
కాల మురిపించు మోకాళ్ల పంచె
దాస్య దారిద్ర్యాది దానవత్వముపైకి
విక్రమించెడు రాట్న చక్రధార
జాతి నేకమొనర్చు జాడలో కులములన్
భూతాల దరిమెడు చేతికఱ్ఱ

మరపు రానివి జన్మజన్మలకునైన
ఓ మహాత్మ! నీ శతజయంత్యుత్సవాలి
కెన్నిగడిచిన గాని మా స్మృతి పథాన
నీ అడుగుజాడ చెరగక నిలుచుగాక!

తెల్లవాళ్ల మొగాలు నల్లవారగ జేసి
మరఫిరంగీలను మళ్లగొట్టి
రవిగ్రుంకనట్టి సామ్రాజ్యము నెదిరించి
పారతంత్ర్యపుడక్క బగులగొట్టి
హింసా మృగమ్ము నహింసతో బడగొట్టి
దౌర్జన్యరాక్షసిన్ దరుమగొట్టి
హరిజన గిరిజనోద్ధరణకై సంకుచి
తత్వమున్ మొదలంట తగులబెట్టి

మానవత దిక్కులకు చాటి మాతృదేశ
దాస్య శృంఖలములను బ్రద్దలుగ గొట్టి
లోక కల్యాణమునకు కర్పూరమట్లు
కరగి పోతివిగాదె మంగళ చరిత్ర!

జగము లబ్బురపడ స్వాతంత్ర్య సమరాన
శాంతి కవచమూని సత్యహింస
లనెడి ఆయుధాల హస్తాన ధరియించి
విజయ మొందినావు వీరగాంధి.

ఆయన దేవుడై తగియు నాప్తులకేవురికేని రాజ్య మి
ప్పింయగ లేకపోయెనట హింసలొనర్పక కాని నీ వహిం
సాయుధమూని గెల్చి భరతావని సర్వజనాళికిన్ స్వతం
త్రాయత లక్ష్మిగూర్చి పరమాత్ముని మించితివో మహాత్మకా!

ఈశునకేని సాధ్యమగునే పగతో పగ ద్రెంపగా! దురా
వేశము వీడి స్నేహమును పెంచుడటంచు సమస్త మానవ
క్లేశ వినాశనార్థము ధరిత్రి సమైక్యసమత్వభావ సం
దేశము దిక్కులన్ని వినదింప వొసంగితి విశ్వశాంతికై.

అంటరానితనము మంటి పాలొనరించి
త్రాగుబోతు తనము తగులబెట్టి
దానవత్వ మార్పి బానిసతన ముడ్పి
జాడ జూపినట్టి జాతిపితవు.

## బ్రహ్మంగారి జాతీయత

మహమదీయులనక మాలలనక నాడె
సిద్ధ కక్కయలను జేరదీసి
కులమతంబులనెడు గోడలబడగొట్టి
జాతిసమత గూర్చి చాటినావు

లోకాన జరుగబోయెడి
చీకాకుల దెలియపరచి చెడు విడుడంచున్
నీ కాలజ్ఞానం బది
మాకున్ కనువిప్పు గల్గ మంచిని పెంచున్

# గణాంకవీణ

శ్రీమంతంబు నొసంగుచున్ జనుల రక్షింపన్ బ్రయత్నింతువేన్
క్షామక్షోభ దవాగ్నులార్పుచు సుభిక్షంబేర్పడన్ జేయగాఁ
ప్రేమన్ నీ గణితార్థశాస్త్రయుగళశ్రీవృష్టి వర్షింపవే
శ్రీమద్దివ్య గణాంకనామ జనయిత్రీ! శ్రీ గణాంకేశ్వరీ!

శ్రీ గణాంక మల్లికా గుచ్ఛ సుమముల
నా కవనమను దవనమ్ము జేర్చి
మాలగూర్చి దేశమాత కంఠమలంక
రింపఁ జేసి కూర్మి నింపనెంతు

శ్రీ గణాంకమాత నా గణాల్గల కైత
తగవులాడ మనకు తగదటంచు
మైత్రిఁ జేసికొనియె మరియట్లుగాకున్న
గణిత కవిత లెట్లు కలసి సాగు

నా గణాంకభేరి మ్రోగెనా దిగ్గున
నిదుర మేలుకొనును నిఖిల జగము
నా గణాంక చేతనాజ్యోతి రగిలెనా
ప్రకృతి నవ్వినట్లు ప్రగతి విరియు

నా గణాంకయోజనాసఖి నవ్వెనా
నవత విరియబూయు నవజగాల
నా ప్రణాళికాంగనామణి మెచ్చెనా
నాగరికత వెలయు నవయుగాల

'బోరు' గొట్టుననుచు బోరునేడ్తురదేల
అంకె అంకె అచ్చరై నటించె
'బోగసు' యని ఇంత ఆగడమదియేల
అంకె అంకె ప్రగతికై జనించె

భావుకాంధ్రమనెడి పచ్చని తోటలో
"ప్లాను"లనెడి నీరు పారుచుండ
శ్రీ గణాంకవల్లి చిగురించి పుష్పించి
ఫలము లీయకున్నె ప్రగతివెలయ

ఎంతమెరసిన పాంథున కింత వెలుగు
జూపలేనట్టి లోపము మాపుకొనగ
కాంతి విరజిమ్మి ప్రగతి మార్గమును జూప
నవతరించె తారకలు గణాంకములయి

* సార్థ కార్ద గణాంక శాస్త్రాలను ఘన
జఘనకుచయుగళిని గాంచ చాలనెగడె
గాన నెడ్డడి యనియెడి కౌను జడసి
సన్నగిలె తెల్గునాడను చాన కహహ !

తెలుపెక్కె ముద్దు చెంపలు గణాంక నిరోధ
        కుల నెమ్మొగమ్ములు తెలుపుబార
నలుపెక్కె చూచుకములు గణాంక విరోధ
        కుల వదనమ్ములు నలుపుబార
బలుపెక్కె తనుమధ్య భాగంబు రాష్ట్రమం
        దల గణాంకంబులు బలుపుమీఱ
బొలుపెక్కె తనువు సొంపుగ గణాంకముల కూ
        ర్పులలో ప్రజైక్యత పొలుపు మీఱ

వింకనేముందు నర్ధగణాంక యువతి
యనెడి చూలాలి గర్భంబునందు నరవి
భావి రాష్ట్రాభి వృద్ధియున్ భవ్యశిశువు
నెగడు చుండెడి తెరగు వర్ణింపఁ దరమె ?

ఏ సతి యోఁత లేక విబుధేశుని బండియు పారదింత కం
జాసన చక్రహస్త గిరిశాదులకైనను భుక్తిపుట్ట బో
దే సతి సత్కృపారస మొకింత లభింపక యున్న అట్టి ల
క్ష్మీసతి రెండు కన్నులన చెల్లవె అర్థ గణాంక శాస్త్రముల్.

సృష్టిన్ జేయగిలేడు దాత హరి పోషింపగ లేడీశుఁడున్
నష్టంబున్ బొనరింపఁజాలడిఁక నన్య వ్యక్తికేలాగు సం
తుష్టిం గూర్చు గణాంక విద్య తనయందున్ లేనిచో గాన "స్టా
టిస్టిక్స్" గద మూల మెల్లరకు పాటింపగ నుర్వీస్థలిన్ !

చాటున్ బోటికి తాళి భూషణముగా సౌభాగ్యమున్ దద్గతిన్
జాటున్ గాదె గణాంకముల్ దొడవులై జాతీయతా శ్రీకహో !
పాటింపంగ ప్రణాళికాభ్యుదయ సంపద్దాయకంబైన మా
'స్టాటిస్టిక్సు'ను 'అర్నమెంట'నుట వాస్తవ్యంఁబు ముమ్మాటికిన్.

దగ్ధంబయ్యెను మన్మథుండు హరుచేతన్ దొల్లి వీక్షింపగా
దగ్ధంబయ్యెను ఖాండవంబు నరుచేతన్ దద్విధానంబుగా
దగ్ధంబౌను గణాంక శాఖ వలనన్ దారిద్ర్య మీ నాడిఁకన్
దుగ్ధంగాంచగనేల "ప్లాను" లిలయందున్ వే ఫలించున్ సుడీ !

అర్థ గణాంక శాస్త్ర మధురామృతమున్ జవిగొన్న వానికే
అర్థమగున్ దదీయ రుచులన్యుఁడెరుంగగ లేడ డెట్లనన్
సార్థక జన్మమెత్తిన రసజ్ఞత గల్గిన వాడు గాక ఛీ !
గార్దభ మెట్ల రుంగును సుగంధ సుఖమ్మదియెంత మోసినన్.

అర్థ గణాంక కల్పతరువర్థుల కర్థమొసంగ కొందర
ర్దార్థ గణాంక కోవిదులు హాస్యముగా యిటు కూయుచుందు రిం
ర్థద మెరుంగకంధులయి వ్యర్థపు కాకుల లెక్కలంచు ఛీ !
గార్దభ మశ్వమట్టులను కాకియు కోకిలవోలె పల్కునే ?

నేత్రంబులు పాలకులకు
శ్రోత్రంబులు ప్రజకు ప్రగతి శోభాభ్యుదయ
క్షేత్రంబులు భవ్యాశయ
సూత్రంబులు నిష్కళంక సుగణాంకంబుల్.

దుష్టంబైన గణాంకము
భ్రష్టంబొనరించు ప్రగతి పథములనెల్లన్
మృష్టాన్న మంతయును కడు
మష్టం గావించునట్టి మక్షిక మటులన్.

పంకిలము గాని శుద్ధ గ
ణాంకములన్ గూర్చి జాతి కాదరమున నే
వాంకితమిడు గణక వరున్
శంకింతురదేల ఎట్టి శాప ఫలంబో!

శ్రీ గణాంక శశాంక చంద్రికలు గురియు
నవ ప్రణాళిక లనెడి కలువలు విరియు
ప్రగతి పథకములను చకోరములు మురియు
కాటకమ్మను కాఱు రాకాసి వెఱయు.

8వ పేజీలో * నిరోష్ఠ్యము. "అర్థ గణాంక శాఖ" అను పదబంధమువలె పెదవి సహాయము లేక పలుకును.

# భాగ్యపథము

ఎండు బీడులలోన దండిగా బంగారు
పంటల పండించు భాగ్యపథము
గుండె దిట్ట పడంగ కండలు పెరుగంగ
కార్మికులను సాకు కర్మ పథము
మండు డొక్కలనిండ తిండిఁబెట్టగ కల్ప
తరు సమానంబైన ధర్మపథము
కొండంత భాగ్యంబు దండిగా జేకూర్చి
అందఱి కందించు నర్థపథము

పండు వెన్నెల చిలకించు భావి భరత
ఖండమున్ స్వర్గ ఖండముగా నొనర్చి
నిండుగా మన నోములఖండముగను
పండజేయు ప్రణాళికా భవ్యథము.

నవ్యసాధన సేద్య యంత్రాల తోడ
గ్రామ సహకార సంఘ చక్రాల తోడ
ముందునకు సాగుచున్నది అందముగను
పంచవర్ష ప్రణాళికా భాగ్యరథము.

భారతావని రాజ్యాంగ పాలనమున
పల్లెలే పునాదులు గాన భవ్యగరిమ
గ్రామసీమల ప్రథమ కేంద్రాల జేసె
పంచవర్ష ప్రణాళికా భాగ్యపథము.

హరిజనులకు గిరిజనులకు
మరి వెనుకంబడిన యట్టి మనుజులకెల్లన్
తెలివులు గల్పింపంబడె
భరతావని నోముపంట ఫలియింపంగన్.

కర్షకుల కార్మికుల కడగంట జూచి
భావి భారత సీమల పచ్చఁజేసి
పసిడి పంటల పండించు భాగ్యరాశి
పంచవర్ష ప్రణాళికా భాగ్యపథము.

మన మనుజ శక్తి యుక్తియు
మన సాధన సంపదలును మన భక్తియునున్
మనసారఁ గ్రియా రూపం
బును దాల్చిన యపుడె తెన్గు పొలములు పండున్.

ఎంత జలరాశి జలము గ్రహించునంత
కన్న వెయ్యంతలిడు ప్రభాకరునివోలె
ఈ ప్రణాళిక వ్యయము నేడెంతచేయు
నంతకన్న ఫలమ్ము వెయ్యంతలిచ్చు.

పైరు పంటల తరువాత పాలుమాల
నేల రైతన్నలార! మీ యింటి యందె
కలుగు గృహ పరిశ్రమ లెన్నొ కలుములీన
పంచవర్ష ప్రణాళికా పథమువలన.

# మాతృస్మృతి

మాతృభాషలోని మాధుర్యమును గ్రోలి
మాతృదేశ కీర్తి మహిని జాట
మాతృసేవ జేయ "మాతృదేవోభవ"
యనెడి సూక్తి పుట్టె నవనిలోన

ఖగమృగాదులు సైత మీ జగతి తమదు
పిల్లలను నిత్య మెంతయో ప్రేమ సాకు
తల్లిప్రేమ గణింప దుస్తరముగాన
తల్లియేకద ప్రత్యక్ష దైవ మరయ.

కడుపునిండ పాలు కుడిపి బుగ్గలమీద
ముద్దులు కురిపించి బుజ్జగించి
నిగ్గుకేలి డోలి నిదురబుచ్చుచు చాల
మురిసిపోవు తల్లి మోద మలర

ఇదిగో పిట్టబుక్క ఇగిగో కాకమబుక్క
బుజ్జి తినుమటంచు బుజ్జగించి
పసిడి వంటి చేత పాల బువ్వను బెట్టు
అమ్మ మమత కెంత కమ్మదనము !

గొప్ప పదవులంది కొండంత వాడైన
తల్లిముందు వాడు పిల్లవాడె
లోకమునకు నెంత లోకువైయున్నను
కొడుకు తల్లికవని కొండపెట్టు.

నరికెడి వానికైనన్
తరువిడదే నీడ నట్లె తల్లియుఁ దననున్
నరికెడి కుపుత్రునైనన్
గరుణన్ మన్నించు కన్నకడుపెట్టిదయో !

అమ్మ బంగరు గర్భాలయమ్ము లోన
వాస మున్నంతకాలమే బాధలేదు
పుడమిపై రాకతో వచ్చె నిడుములన్ని
నీటఁ బాసిన చేపకున్ జేటురాదె !

తల్లికన్న మిన్న దైవంబు కనరాదు
తండ్రికన్న మిన్న దాతలేదు
తల్లిదండ్రులకును తగుసేవ జేసెడు
వాఁడె ధన్యవరయ వసుధలోన.

అంబ యను శబ్ద మెంత సారంబుగలదొ !
వేదమై విశ్వమంతట వెలసిపోయె
నట్లు గాకున్న నేర్పించినట్టు లేల
పలుకుచున్న 'దంబా' యని పశువుకూడ.

జననీ ! కృపాతరంగిణి !
నిను దలచిన యంత కనులనిండుచు నుప్పొం
గిన జలమున నభిషేకం
బొనరింతు భవత్పదాబ్జయుగళికి భక్తిన్ !

భారమునెంచకుండ నను బంగరు గర్భమునందు మోసి, ఈ
ధారుణిజూపి, నీ అమృతధారలతో నను బెంచి నాపయిన్
బేరిమి కూర్మి యెప్డు కురిపించిన తల్లివి నీవు. జన్మలో
నీ ఋణమెట్లు దీరు జననీ ! పరిపూర్ణ కృపాతరంగిణీ !

కంటికి రెప్పవోలె ననుగన్న దినంబున నుండి యెప్పుడే
కంటకమంటకుండ కడగంటనుగాచుచు నా కొకింత కీ
డంటిన రాత్రియున్ బవలు నారటమంది మదీయసేవలో
కంటి కొకింత కున్కయిన గానవుగా జననీ ! కృపాధునీ !

ఇంతపై కొక్క చేసినవంత జెంది
రాత్రి శివరాత్రిగా నిదురలకు వాసి
ఓర్మి నుపచారములను జేయుచును నన్ను
గరవాన సాకినది నా కన్నతల్లి !

జన్మజన్మల మరువక జనని ఋణము
వ్రాసికొందును హృదయ పత్రమ్ము మీద
మాతృమూర్తిని నిరతము మరువకుండ
హృదయ ఫలకముమీద చిత్రించుకొందు.

ఓరిమియందున ధారుణి దలపించు
మాతృదేవత నిన్ను మరువగలనె ?
నిస్వార్థమందున నింగిని మరపించు
పరదేవతా ! నిన్ను మరువగలనె ?
కారుణ్యమందుఁ బొంగారు నీరధిఁబోలు
కరుణామయీ ! నిన్ను మరువగలనె ?
ఆత్మబలమునందు ననిలము సరితూగు
మముగన్నతల్లి నిన్మరువగలనె ?

శౌచమున నగ్నిసమముగా దోచునిన్ను
పరమ ప్రత్యక్ష దేవతా ! మరువగలనె ?
పంచభూతాలు నీలోన పరిఢవిల్ల
జనని ! విను మరువగలనె ఈ జన్మలోన ?

అమ్మయొక్కతె సాక్షిదైవ మ్మటంచు
అమ్మ పదపద్మముల చెంత తుమ్మెదనయి
అమ్మ కీర్తి గీతికల ముదమ్ముమీర
కావ్యగానమ్ముసేయ నా కాంక్షగలదు.

—నా "మాతృశ్రీ"నుండి

# కనువిప్పు

కనులనుమూసి యెవ్వరును గాంచగలేదని పిల్లిపాలు త్రా
గిన గతి దొంగచాటున నకృత్యము లెన్నియొ సల్పుచున్ మహా
జనముల కన్నుగప్పినను సాగదులే 'పయివాడు' చూచి దం
డన విధియించు కావున దినమ్మొకసారి తలంపు మీశ్వరున్.

తా నొనరించు తప్పులను దాచుచు లోకము కన్నుగప్పు టెం
తేనియు గొప్ప తప్పు పరమేశ్వరు డొక్కడు సర్వకృత్యముల్
గానకపోడు వాని కనుగప్పగలేమని యెంచు భావమీ
మానవజాతి కభ్యుదయ మార్గము జూపును కాంతిపుంజమై.

పగలు పనులెల్ల ముగియ మాపటికి నిల్లు
జేరి ప్రతివాడు మునుముందు శివునిముందు
చెప్పికొనవలె దా జేయు చెడుగులన్ని
కాక నెట్లీశ్వరుని కనుల్ గప్పగలము ?

# అమరశిల్పి

గుండెలేని కొండబండలో నిండుగ
జీవధారవోయు శిల్పిసృష్టి
గట్టితనములేని కమల గర్భుని సృష్టి
కన్నమిన్నగాదె సన్నుతింప.

అందాలు చిందు శిల్పము
లెందైనను చూడచూడ నేదోమహదా
నందము డెందము లోపల
మందాకిని యౌను శిల్పిమహి మేమందున్.

సుకవి కలము మున్ముందు దాసోహమనెడి
భాష చందంబు నీ ఉలి బలముముందు
బెండులయిపోయినవి కొండబండలన్ని
ఉత్తముల ముందు కఠినులు మెత్తబడరె ?

సుత్తె ఝణఝణలో నేమహత్తు గలదొ !
యుగములే మాఱుమ్రోగె నోహోయటంచు
నవ జగంబులు మేల్కాంచె నాగరికత
నాట్యమాడ దొడంగె నానాటి కహహ !

నాస్తికత్వము బాపి ఆస్తికత్వము సనా
తనము గావించి సత్యమును చాటి
శిల్పకళాజ్యోతి క్షితిమీద వెలిగించి
భారతీయత దిశల్ ప్రాకఁజేసి

కీలుగుఱ్ఱాలు యుగాల కాలమునాడె
గగనాల నడిపి విఖ్యాతిఁగాంచి
హరపామొహంజలో నవరూప సంస్కృతి
నెలకొల్పి నవ జగంబులకు దెల్పి

వింత చందాల జిమ్మ నజంతశిల్ప
ములను సృష్టించి చరితకే మూలమగుచు
నవతకును కవితకును పునాదివేసి
అవని వెలసితివయ్యా ఓ అమరశిల్పి !

పూర్వ చారిత్రమనియెడి పుణ్యధనము
దోచబడరాని తీరుగా దాచినావు
నీకు ఋణపడి యుండెరా లోకమెల్ల
శిల్పకులతేజ ! సంస్కృతి కల్పభూజ !

విశ్వ జనులకెల్ల వెలుగుబాటలజూపి
కవికి కర్షకునకు కలము హలము
సృష్టి జేసినావు శిల్పకళానిధి !
నీ ఋణంబు మరచునే జగంబు ?

## చెక్కిలి నొక్కు

చిరునగవు లొలకించెడి తరుణమందు
సుందరాంగన చెక్కిలి సొట్టవోయె;
దాత కనుబొమల్ దిద్దు సందర్భమందు
చివరి వ్రేలు ముద్దిడినట్టి చిహ్నమొక్కొ !

# సాంధ్యరాగము

సిగ్గు చెక్కిళ్ళ చెంగావి చీరగట్టి
అంబరంబను ఫాలభాగంబునందు
అదిగో ! సూర్యబింబమును సంధ్యావధూటి
పెద్ద కుంకమ బొట్టుగా బెట్టుకొనియె !

సంధ్య తా పశ్చిమాంబర జలధిలోన
స్నానమాడెడు తరుణాన భానుబింబ
మదిగో ! రంగారు మాంగల్యమా యనంగ
గిరిపయోధరములమధ్య మెరసిపోయె

అదిగో ! ఇనబింబమా కాదు అది తమలము
లావు నమలిన సంజకెమ్మోవి నిజము
అరయగా అది పశ్చిమాంబరమకాదు
సంజ ఉమిసిన తాంబూల రంజితంబు

అకట ! నడచినడచి బడలికను జెంది
ఇనుని ముఖమెంత యెర్రబారినది చూడు !
సేదదీర్చుకొనంగ పశ్చిమ పయోధి
స్నానమాడగ మున్గుచున్నాడు చూడు !

పశ్చిమాంబర తీరాన భాను డస్త
మించుచుదయించునట్లు గాన్పించుచుండు
ఘనుడు పుట్టిన గిట్టిన కాంతి విడక
ఒక్కతీరున రాజిల్లుచుండు నెపుడు

నా క్రధుని రుద్రు శిరమందు దూకునపుడు
ఘన జటాజూట మల్లదె కట్టుచెదర
నహహా ! విరజారె తామ్రకేశార్ణవంబు
అపరదిక్తీర సాంధ్యరాగార్ణవంబు

## ఏసు ప్రభూ

ఒక చెంప వరుచువానికి మరుచెంప జూ
పించి రాలను గరగించినావు
సిలువ కెక్కించి హింసించెడు నరరూప
మృగముల దయతో క్షమించినావు
ద్వేషాగ్నిపై ప్రేమ పీయూషమును గురి
యించి మోడుల చిగురించినావు
దానవత్వమ్మను దావాగ్ని నార్పి మా
నవత నిద్ధాత్రిపై నాటినావు
రక్కసులమధ్య నీవు మరొక్కమారు
క్షమ దయా శాంత్య హింసాది సద్గుణముల
చాటి నేటి జనాళికి జ్ఞానమార్గ
మేల జూపించ రావయ్య ఏసుప్రభువ !

# సస్యసుందరి

వంపు సొంపుగ పారు వాగులు నదులును
వెండి వడ్డాణాలు వేడ్కగాగ
సొగసార పండిన జొన్నచేల్ పసిడి గ
జ్జలకుచ్చు 'రిబ్బన్లు' జడలుగాగ
మురిపార నీనిన వరిచేలు పట్టు దా
రాల ముత్యాల హారాలుగాగ
తళుకారు మంచు ముత్యాలు శీర్షంబుపై
చల్లిన మౌక్తిక కాక్షతలుగాగ

తరణి కిరణాలు చుంబింపఁ దళుకుమనెడి
గరిక చెవి చెంపనలరు నూగారు గాగ
పచ్చిక బయళ్లు పచ్చని పైట గాగ
పైరు ఒయ్యారి వెలసె సింగార మొలక.

పాలిపోయిన చెక్కిళ్ల వన్నె కలిగి
గర్భ భారాన మైవాల్చి కదలలేని
నిండు చూలాలి వోలె ఈ పండిన వరి
పైరు నెలతుక చూడ సంబరము గొల్పు.

నా కవిత్వము వినువారు లేకయున్న
చింతయేలేదు నాకు రవంతయైన
వాయుడోలల నూగుచోహోయటంచు
పైరు దొరసాని మెచ్చు నొయ్యార మొలక.

*గాలిగాడు బలిమి కౌగిటన్ బట్టగా
సిగ్గు బరువుచేత శిరమువంగ
అంత పసిడిగాజు లడ్డగింపగ గోరి
గలగలయని ప్రణయ కలహమాడె.

## దశావతారస్తోత్రము

మత్స్యావతార నిన్ మదిలోన దలతును
కూర్మావతార నిన్ గూర్మి గొలతు
వరహావతార నిన్ స్మరణమ్ము సేతును
నరసింహ నిన్ను నే శరణుగొందు
వామనా నీ కిదే వందన మొనరింతు
పరశురామా నిన్ను బ్రస్తుతింతు
రామావతార నిన్ బ్రేమ నారాధింతు
శ్రీకృష్ణ నిన్ను పూజింతు నెపుడు
బుద్ధదేవ నిన్ను బుద్ధితో సేవింతు
కలికి నిన్ను హృదయ మలర నెంతు
భక్తితోడ నిన్ను పది వేసముల సామి
అభిమతార్థ సిద్ధికై భజింతు.

పదివేసాల దొరా! నీ
పదకమలయుగమ్ముచెంత భ్రమరమునై చే
సెద నీదు నామ గానము
యెదలోగలభక్తి పొంగి యేరై పారన్.

* వడిగావీచిన గాడ్పు తాకిడికి జొన్నచేను చేష్టము

# ప్రియలేఖ

రసికుడొక్కడు తన ప్రియురాలి వీడి
దూరదేశాల కేగిన కారణమున
విరహవేదన కెడద ద్రవించి పోగ
చెలికి ప్రియలేఖ నిట్లు రచించి పంపె.

నా ప్రణయసఖీ ! నా చేతనావధూటి !
నీ వియోగ నిశీధిలో నింగి నేల
కానరాకుండె నీ స్మృతి కాంతి యింత
విరియ ప్రియలేఖ వ్రాసి పంపెదనుగాక !

ప్రియసఖీ ! నీ వియోగ మప్రియమె అయిన
ఎంత వెచ్చన ! యెద ద్రవియించి పోయి
ఘృతముగాగ నీ మధుర సంస్మృతి రగుల్చు
చేతనాజ్యోతి లో నిన్ను జూతుగాదె !

నినుగూడి యుండునప్పుడు
క్షణములుగా మారు యుగయుగంబులు గూడన్
నిను వీడి యుండునపప్పుడు
క్షణములు యుగయుగము లౌచు గడుచున్ సఖియా !

ఏమి చెప్పుదునే ప్రియా ! ప్రేమపూర్ణ
మధుర మధురానుభావ సంస్మరణ పవన
వీచికలచేత జృంభించె విరహకీల
తోడుపడనేల సజ్జనుల్ దుర్జనులకు ?

నీ వియోగాగ్నిచే గుండె నీరుగాగ
మధుర నయనార్ద్రి బాష్పవారిధులు నిండి
తాప మొక్కింత చల్లార తాళుచుంటి
కాకపోయిన ఘడియలు గడుపగలనె ?

వెన్నవంటి మనసు విరహతాపాగ్నికి
కరగి కరగి పారి కనుల నిండె !
కదలి కదల కుండ కన్నీటి కెరటాలు
దొరల కుండె భరము తరగకుండె !

ఓ సుహాసినీ ! నీ దరహాస చంద్రి
కలకు సరిరాక ఈర్ష్యచే కలువరేడు
వేడి వెన్నెల కురిపించి దాడి సలిపె
అకట ! నీ జంట లేనట్టి అదనుజూచి !

ఎదలెదలు కలుపు కౌగిలి
కొదవెడు మధురానుభూతి కూరట పడు నా
మది మెదలెడు నీ మృదుమృదు
పద చుంబన భాగ్యమబ్బ పరవశపడితిన్

నిను నెడబాసియుంటినను నేరము నన్ విరహాగ్నిఁ ద్రోయ జా
లినిగొని దూరమార్గముల లెక్కయొనర్చక స్వప్నమందుఁ చ
య్యన నన్ను బ్రోవ వత్తువు పదాబ్జము లెంతగ నొచ్చెనోకదా !
తనివెద నశ్రుధారల పదంబులు కన్నుల కద్దుచున్ సఖీ !

తనువులు వేరువేరుగ విధాత సృజించిన నేమిలే సఖీ !
మనములు వేరుగాక క్షణమాత్రము వీడక నిత్యనూత్న యౌ
వనవన వీధులన్ మధురభావ కవిత్వ తరంగ గీతికల్
తనియుచు పాడుచున్ విరహతాపము వోన్ విహరించుచుందమే.

ఆలయము దూరమైన నేమాయె ? స్వామి
భక్తులకు దగ్గఱేయుండు పగిది ప్రియులు
యెంత దగ్గఱ నుందురే యెదలు కలిపి
విరహమున స్నేహమున కెంత విలువ గలదె ?

ఇదిగో ఒక ముచ్చట విను
మదిలో నే దాచుకొన్న మధురస్మృతులన్
విదితం బొనరించగ తగు
పదములు ప్రాప్తిలక నీదు పదములు గొందున్ !

' తెలివిజను 'లోవలె హృదయఫలకమందు
నిన్ను దర్శింతునే ప్రియా ! నిరతమేను
అట్లుకాకున్న నామది యిట్లు విరహ
వేదనమునొంది కూడ వినోదపడునె ?

నాదు వీడ్కోలు వేళ నీ నయన బాష్ప
వాహినీ స్మృతి నా కడ్డు పడుటచేత
అస్మదీయ మనోవేగ యానమునను
లిప్తమున దెందమందె దర్శింతు నిన్ను

నా హృదయ వీణపై నీవు నాట్యమాడు
మాధురీగాన లహరివై మరపురావు
మనసు లొకచోట గలిసిన మనకు విరహ
వేదనమ్మ వినోదమౌగాదె సఖియ !

అస్మదీయ హృదంబర మందుమేఘ
మాలవై నీవు విహరించు వేళలందు
నాకవనబాల నెమలియై నాట్యమాడ
సఖియ ! ప్రియలేఖ పింఛపింఛమున వెలసె

తాననుభవించు విరహవేదనము గూర్చి
రసికు డీరీతి ప్రేమతో వ్రాసి పంపి
నట్టి ప్రియలేఖఁగని ప్రణయాశ్రువులను
రాల్చి ముసినవ్వుతో ప్రియురాలు మురిసె

నెఱి మురిసిమురిసి పోవుచు
మరిమరి ప్రియలేఖ చదివి మధురస్మృతిలో
చిరుపెదవి నవిమి కొరుకుచు
నెరుపెక్కిన బుగ్గమీద నిడుకొనె వ్రేలున్

అద్దాల చెక్కిళులపై
నిద్దపు ప్రణయాశ్రుధార నిలువక దూకెన్
ముద్దాడగ ప్రియలేఖను
హద్దులుగలవే రసాబ్ధి కరయగ ననవిన్.

## గోలకొండ కోట

నీ షాహి నిషాలో బే
హోషై పడియుండె గాక ఒక్కొక్క శిల సం
భాషింపకుండునే? తా
నీషా! నీషాను గూర్చి నిజముగ నాతో

# ఒంటరి

"వింటరు"లో జంటనువిడి
ఒంటరియై యాత్రసేయుచుండెడి రసికున్
కంటకుడై బాధించెడి
తుంటరి చలినాతడిట్లు దూషణ జేసెన్.

నీ ప్రభుత్వమందు నీతి యున్నదె చలీ!
పగలు తచ్చు నిశలు బాగహెచ్చు
ప్రియులొకళ్లొకళ్ల బిగి కౌగిళుల దేలి
ప్రొద్దుపోయి నిదురపోవుచుంద్రు

శౌరియంతవాడు చలి! నీకు భయపడి
సిరిని వక్షమందె చేర్చికొనియె
అంతకన్న జడిసి అర్ధనారీశుడై
సాంబశివుడు గౌరి జంట విడడు.

జంటన సఖి యున్నప్పుడు
కంటన్‌బడ కెందుబోదు? కౌగిటిమంటన్
గెంటి నిను జంపుదుమురా!
తంటా నీకేల నన్ను తాకకుర చలీ!

అరయగజంట జోలికెపుడైనను బోదువె కౌగిటాగ్నినిన్
గరకర కాల్చివైచునని కాని ప్రియాంగనలేనివేళ తుం
టరివయి నిర్దయన్ గటకటా! భయకంపితుగా నొనర్చినన్
గరచుచు హింసపెట్టెదవుగా చలి! ఒంటరియెంతలోకువో!

గడుసుతనాన ఒంటరిని కాలము నీదని విఱ్ఱవీగి పై
బడి వడకించుటెల్ల నొక పౌరుషమా ? సఖి జంటనుండ న
ల్పుడవయి బిఱ్ఱుదప్పి యెటుబోకుము కౌగిలిమధ్య మందునిన్
బొడిపొడిచేసి చం-పెదము పుణ్యము పాపము లెంచకుండగన్.

వలపుమదంబుచే ప్రణయభండనమందు పెనంగు వేళలన్
కులుకుల మేల్మిబంగరుపు కొండలరాపిడివల్ల బుట్టు న
గ్నులబడి చావజూచెదవొ కో చలి ! నన్గిలిగింతపెట్టి నె
చ్చెలి పరిరంభమున్ దలువజేతువు కచ్చకు కాలుదువ్వుచున్.

చలి ! నీ పొగరణచగ గొం
గళి గప్పగనేల ? ప్రియులు కౌగిలిబిగిలో
మెలికొనిన చాలదాయని
పలికిరి రసికాగ్ర చక్రవర్తులు భువిలోన్.

చలి ! నీకు వణక నేటికి ?
తెలియక సెగకాపనేల దిట్టంబగు కం
బళి బిఱ్ఱువెట్ట నేటికి ?
చెలిగాఢాలిగనంబుచే బోవె చలీ !

నులివెచ్చని చెలి తలపులు
చలిచలి చెలిచెలి యటంచు సందడి సేయన్
భళి: భళి ! చలిగిలిగింతల
చెలికవుగిలిగింత లెంత చెలరేగు నహో !

చలిలో వెచ్చని బిగికౌ
గిలి కోరికలూరుచు గిలిగింతలు వెట్టన్
చెలి మధురస్మరణంబున
చలితో సరసోక్తులాడ చలియిట్లనియెన్

ఓ రసికచక్రవర్తీ!
నేరూఢిగ నొక్కమాట నీతోననెదన్
సారెకు సారెకు కౌగిలి
ప్రేరణ కలిగించుచుందు ప్రియులు సుఖింపన్

చలిబాధ ప్రియుల కౌగిలి
వలన శమించనెడిమాట వాస్తవమైనన్
దలపోయవు నాచే కౌ
గిలి సౌఖ్యము హెచ్చుననుచు కేళీపురుషా!

ప్రేమికులు బిట్టుకౌగిలి
లో మత్తుగ నుండువేళలో మర్యాదన్
ప్రేమికుల జోలికరుగను
నా మంచితనంబు మరచినావా రసికా!

జంటగల భాగ్యశాలుర
కొంటికి జిగిబిగి నొసంగు దొప్పిదమగుటన్
జంటను విడు నేరమునకు
నొంటరి హింసింతు నదియు నొప్పిదమగుటన్.

జంట జీవించనేర్చిన సౌఖ్యమబ్బు
జంటవిడి సంచరించ కష్టంబు గలుగు
గాన సహజీవనంబు సౌఖ్యప్రదంబ
టన్న లోకోక్తి తెలియదేమయ్య నీకు?

# దుగ్ధాంజలి

సిరులలో నెవ్వేళ మురియుచుండు నొకండు
కూడొకింతయు లేక మాడు నొకఁడు
సంతాన మధికమై వంతజెందు నొకండు
పిల్లలులేక చింతిల్లు నొకఁడు
తలుపకయే ఫలంబులను పొందుఁనొకండు
తలచి ఘటిల్లక నలుగునొకఁడు
దొడ్డపదవిఁబొందు దుర్మార్గు డొక్కండు
హైన్యస్థితి మెలంగు మాన్యుడొకఁడు

అలఘు కష్టంబు లొందు పుణ్యాత్ముడొకఁడు;
అతి సుఖంబుల నొందు పాపాత్ము డొకఁడు;
ఏమి చెప్పుదునయ్య సర్వేశ నీదు
చిత్రలీలల వర్ణన సేయతరమె?

అమిత తాపంబుచే నీ దయామృతమును
బడసి సుఖియించు కొరకునే పరుగులిడితి
గాని మృగతృష్ణగా మారెగా యమృతము
క్షితిని దురదృష్టుడెట్లు మేల్ జెందగలడు?

తానొకటి దలంప దైవంబొకటి గూర్చు
దైవ విధికి నడ్డు తగుల లేము
తలచుకున్నదెల్ల తప్పక నెరవేర
దైవముండె ననుచు తలతు రెవరు?

విధివశంబుచేత విశ్వసంతానంబు
కష్టపడుచునుండ గాంచలేక
దైవమన్న తండ్రి దాగిపోయెనో యేమొ !
కాకపోయెనేని కానబడదె ?

వెంట నంటెడు విధియను వేటమృగము
పాణిలో జిక్కినట్టి దౌర్భాగ్యజీవిఁ
రక్షజేయగ జాలవు రక్షకుడని
బిరుద మేరీతి గలిగెనో పరమ పురుష !

నీ దయాసాగరములోన నేమికొరత
కలిగెనో నిన్ను పలుమారు తలచితలచి
దేహియనువాని దాహంబు దీర్పవైతి
వరదుడను బిరుదెటుబోయె పరమపురుష !

కమ్మని చిమ్మచీకటుల కౌగిలినుండి విమోచనార్థమై
క్రమ్మఱ ప్రాకులాడుచు అగాధములో బడియుంటి కాంతిపుం
జమ్ము నొకింత నాపయి ప్రసన్నుడవై ప్రసరించవైతి నిన్
నమ్మినవారి నీపుడమి నవ్వులపాలొనరింతువా ? ప్రభూ !

పుట్టుటగిట్టుటో ! మరల పుట్టుటెగిట్టుటా ! గిట్టిపుట్టుటో !
గిట్టుట పుట్టుటల్ దెలిసి గిట్టని పుట్టుక పుట్టుపెట్టులో
మట్టి శరీరధారులము మాయజగంబున బుట్టి సృష్టిలో
గుట్టునెరుంగలేము మముగూరిమితో దరిజేర్పు మీశ్వరా !

# హృదయాంజలి

కంఠమా ! ఎలుగెత్తి కమ్మగా పాడుమా !
ముద్దుగోపాలుని మురళివగుచు
హృదయమా ! హాయలొల్క ముదముతో నాడుమా !
మాధవు ప్రేయసి రాధవగుచు
భావమా ! మేఘాల పగిది యొప్పారుమా !
వాసుదేవుని మేని వర్ణమగుచు
కావ్యమా ! సొగసొల్కగా కౌగిలించుమా !
మధువైరి గళమును మాలవగుచు

భక్తిరసమా ! ముకుందుని పాదములను
క్షాళనంబొనరించి తజ్జలమునెల్ల
శిరముపై జల్లుకొనుమ సంబరముమిగుల
పాపపంకిల మెల్లను బాయునటుల !

స్వామి ! నీ పాదముల మనసార కడిగి
దైన్యమున మ్రొక్కులర్పింపఁ దలఁచినంత
యాచనాదీన నేత్రద్వయమ్మునుండి
గోరువెచ్చని కన్నీరు కురియసాగె !

భక్తిరసపూర్ణ భావ సంపత్తిచేత
పొంగిపొంలెడు బాష్పతరంగములకు
యెడదలోనున్న మలినము కడుగబడియె
అడుగిడుము స్వామి నాయెదగుడిసెలోన !

శిధిలమైనట్టి నాచిన్ని చిత్తగృహము
లోన నడుగిడ భక్తి సోపానములను
వేసికొని నిన్నుబిలచితి వేగరమ్మ
ఆరగించగ పేద సత్కారములను

దిక్కు నీవని నమ్మితి నిక్కముగను
ఎక్కడున్నావు నాతండ్రి ! ఎందు కిటుల
చిక్కుకున్నావు టక్కరి చక్కనయ్య !
చిక్కరా ! దక్కరా ! నాకు శీఘ్రముగను

హే ప్రభూ ! హేదయాకర ! హేదయాళు !
పాహిమాం ! దీనబాంధవ ! పాపహారి !
ఈవుదప్ప నితఃపరం బెరుగనయ్య ?
రమ్మ వేవేగ నన్నేలుకొమ్మస్వామి !

విశ్వసామ్రాజ్యమేలెటి విశ్వనాధ !
నీవు లేకుండ విశ్వంబు నిలువగలదె ?
దారమేలేక పుష్పాలహారమగునె ?
విశ్వమంతయు నీ ప్రతిబింబమయ్య !

## అపూర్వ మైత్రి

కులమతజాతి వైరములు కూడిన మానవజాతిలోననే
కలుగవు శాంతి భద్రతలు కాని విరోధములెల్లమాని బె
బ్బులులును గోసమూహమును ముంగి భుజంగము లొక్కచోటనే
కలిసి వసించుచుండుననగా నప్పుడు 'నిర్మల' చిత్రశాలలోన్

# రోషాగ్నిధార

భానునొక్కమారె పలుమార్లు చంద్రుని
హింసపెట్టు గాములీజగాన
పనికిరాని చల్లదనము హానినెగూర్చె
కఱ్ఱలేనివాని గొఱ్ఱెగఱచు

పౌరుషమ్ములేని వానిజూచినయంత
అల్పశత్రువైన అణచజూచు
మెల్లగాను వీచు పిల్లగాలికి గడ్డి
పరక ఎగిరిపోవు పగిది సుమ్మ!

జింకను తొడనిడుకొనిన మృ
గాంకాఖ్య కళంక మాశశాంకున కొదవెన్
జింకల గుంపుల కొలది ని
రంకుశముగ జంపిన మృగరాజనిరి హరిన్

మలమల మరిగెడి నేతిన్
జలబిందువు వడిన పగిది శత్రువుచెవి శీ
తల వచనంబులు సోకిన
జ్వలనుని చందమున భగ్గు భగ్గున మండున్

భాయీయంచును సామో
పాయంబున గెలువగలమె? వైరుల దండో
పాయంబున గాక కుదురు
నే యామజ్వరము చల్లనిజలము చిలకన్?

అవమానింపం బడియును
లపమేని చలించనట్టి లజ్జాహీనుం
డవని జనించని యెడల ప్ర
సవవేదనచేత పోవు జననికి జగతిన్

అద్రులందు నుండు సౌన్నత్య మొక్కడే
కడలియందునుం డగాధ మొకటె
కాని ధీరులందు క్రమముగా నీరెండు
కలిగియుంట వీరి గెలువ వశమె ?

యువతులకు సిగ్గు పురుషుల కోర్పుయుంట
భూషణములయ్యు స్త్రీలు సంభోగమందు
లజ్జవీడిన యట్లు పరాభవమున
పురుషులును పౌరుషమును జూపుటయు లెస్స

క్షమతో గూడిన పౌరుష
మమితంబుగ లాభకారియౌట నిజము దీ
పము వత్తిగూడియే కద
చము రందుకొనంగ జాలి చక్కగ వెలుగున్.

—మాఘకావ్య మాధారంగా

## నమ్రత

ఫలభారంబున శాఖలు,
జల భరమున జలధరుండు, జవరాలి కుచం
బుల భరమున మధ్యము, సద
యులు నమ్రులుగారె ఉన్నతోన్నతి గల్గన్.

# మొదటి పోరు

తడిసెరా ! మన నేల త్యాగరక్తంబున
స్వాతంత్ర్య వీరుల సమరమందు
చెండాడెరా శత్రుశిరముల మనఝాంసి
రాణి హస్తాన వజ్రాయుధంబు
మ్రోగెరా ! రణభేరి భువిదద్దరిల్లగ
పరరాజ్య ఘాతము భంగపడగ
పులకించెరా ! జన్మభూమికి మయి నిజ
సంతతి వీరవసంతమాడ

భరతవీరుల ఖడ్గాల కరకుధాటి
కెరయగుచు తెల్లవారలు వెరగుపడగ
పచ్చినెత్తురు కాల్వలై పారుచుండ
మొదటి భారతస్వాతంత్ర్య కదనమయ్యె

కవచముదాల్చి హస్తమున ఖడ్గముబట్టియు నశ్వమెక్కియున్
లవమును జంకకుండ పరులావు నొకింతయు లెక్కసేయకీ
యవని సివంగిభంగి రణమందున శత్రుల గుండెనెత్తురున్
జవిగొనుచుండెనా ? యనగ ఝాన్సి పురీశ్వరి గోచరించెడిన్

గడచె శతాబ్దిన్ భరతఖండమునమున్ మన భారతీయులా
పడమటి తెల్లవారి చెడుపాలనమున్నదు గంటద్రొక్కగన్
నడిపి స్వతంత్ర సంగరము నాటిరణడిబున వీరస్వర్గమున్
బడసిన వీరకోటి కృషిపండి ఫలించెను నేటికి ధరన్ !

భరతపుత్రులు మంగళపాండ్య తాంత్యా
వైరిఘాతుకి లక్ష్మి కున్వారుసింగు
మాతృదేశానికై పోరి మాన్యగరిమ
అమరులైనారు స్వాతంత్ర్య సమరమందు

# వీ ర గ ళ ము

'జై హింద' టంచును జయపెట్టరా ! దిగం
తాల నీగళము నినాద మీయ
శపథమ్ము సేయరా ! స్వాతంత్ర్య రక్షణా
ర్థమ్ము నీ జన్మ ధన్యమ్ము గాగ
వ్రాయరా ! వీర కావ్యము నేడు నీ జాతి
పౌరుష రుధిర స్రవంతి పొంగ
గర్జించరా ! వీర కంఠీరవంబయి
గోముఖ వ్యాఘ్రాల గుండెలదర
తలపరా ! వీర రాణప్రతాప సింహుఁ
ఛత్రపతిఁ రుద్రమాంబను ఝాంసిరాణి
నిలుపరా ! నేడు నీ జాతి నిండు గౌర
వంబు నీ ప్రాణ ధనముల బలియొసర్చి.

రాబభక్తి గర్గె రామాయణము నాడె
ఉగ్రపాలతోటి ఉడుతకైన
ఆప్తమైత్రి కొరకు అసువు అడ్డుపెట్టి
రాకసు నెదిరించె పక్షియైన

కదన రంగమందు కొదమ సింగంబయి
పోరి పోరి అమర వీరుడైన
భారతమ్మ నాటి వీరాభిమన్యుని
* తమ్మి పిలుపు వచ్చె తరలి రమ్మ!

సింగము వంటి వాడ వరిసేనలు నిన్ దొడగొట్టి పిల్వగా
సంగర భూమిలో దుమికి శత్రువు గుండెలఁజీల్చికాని నీ
కుంగల పౌరుషానలము కొంత శమింపదు నేడు భారత
ప్రాంగణమందు ధూర్తులు సవాలుగ విల్వ నుపేక్ష సేతువే?

ధూళి అచేతనంబయిన త్రొక్కినవాని శిరంబు మీదికిన్
వాలగ జిమ్మ చేతనుని పౌరుషమెంతన వచ్చు, మాతృ దే
శాలయమందు దుష్కర దురాక్రమణంబు ఘటిల్ల పౌరుష
జ్వాలల శాత్ర వాదముల భస్మ మొనర్చక నూరకుందువే!

అచ్చపు వెన్నెముద్ద అమృతాంశుని మ్రింగు ననేకమార్లు కా
ర్చిచ్చు కణాల భాస్కరుని మ్రింగు నొకొక్కకమారె గాములీ
మ్లేచ్ఛుల పై ఖరింతెగద మెత్తగ నుండెడివాని మీదికే
కచ్చెకు కాలుదువ్వుదురు కాని కఠోరునిమీఁద చెల్లునే?

నీ మాతృ ధాత్రిలో రిపు
సామజములు జొచ్చుచుండ శాంతముతో నీ
వే మాడ్కినుందు విఁక సం
"గ్రామములో సింహమగుచు కదలగ వలయున్"

---

* తమ్మి = తమ్ముడా అని ఒక అర్థం.
పద్మవ్యూహమని రెండవ అర్థం.

# విశ్వఘోష

ఓ అసూయా ! నీకు యుగములు గడిచిన
కడుపు మంటలు చల్లబడకపోయె !
ఓ వైరమా ! నీకు యుగములు గడిచిన
కరడు గట్టిన గుండె కరుగదయ్యె !
ఓ గర్వమా నీకు యుగములు గడిచిన
కళ్ళు గప్పిన క్రొవ్వు త్రెళ్ళదయ్యె !
ఓ స్వార్థమా ! నీకు యుగములు గడిచిన
సంకుచితత్వము పడలదయ్యె !

యుగయుగాలనుండి ఉస్సురో యని యిట్టి
రకరకాల జబ్బులకు గురియయి
ఏల శాంతిలేక ఏడ్చెదరే మీరు
మానవత్వ మనెడి మందు దినక !

జీర్ణాంబరాలలో పూర్ణాభిమాన ద్ర
వ్యము దాచలేకను వగచివగచి
వైద్యంబు లేని దుర్వ్యాధి పీడితులను
గాంచలేకను గుండె కరగికరగి
పూట పూటకు మాడు పూరిండ్ల కాపురా
ల్గనలేక కన్నీరు కార్చికార్చి
పని లేక వీధ్వడు జనకోటి నిట్టూర్పు
వేడి కోర్వగ లేక వాడివాడి

ధరల గిరుల ఢీకొనలేక సొరగి సొరగి
మూర్ఛలినది మానవత నిట్టూర్చె దేల ?
ఓ ప్రణాళికావ్యూహమా ! ఓ పురోగతి !
ఓ నవత ! ఓ యువత ! ఓ నవోదయంబ !
తేరె "చైతన్య సంజీవి" తేరు కొలుప !

పశు బలమ్మున తోటివాని కొంపకు నగ్గి
నంటించి నగు నున్మదాంధుదొకడు
ధన మదమ్మున కనుల్ దలకెక్కి తైతక్క
లాడు చపుము సల్పు నల్పుడొకడు
సంకుచితత్వమన్ జాడ్యంబుసోకుట
సమదృష్టి బాసిన కుమతి యొకడు
మత్సరంబున పరమతముల ద్వేషించి
కల్లోలముల రేపు ఖలు డొకండు

పచ్చని తలమందు చిచ్చు రేపు నొకడు
ప్రజల మోసగించు కుజను డొకడు
నీతి నూతఁబడిన జాతి గోతఁబడిన
పదవి విడని స్వార్థపరు డొకండు

యుద్ధోన్మాదముతో దురాక్రమణ మొక్కొక్కండు సాగించు దు
ర్బుద్ధిన్ లోకవినాశకుండొకడు బాంబుల్ సృష్టిగావించు స
ద్బుద్ధిన్ మానవతా వికాసమునకై పోరాటమున్ సల్పగా
సిద్ధాంతంబు నెరింగి విశ్వజనతా శ్రేయంబు నూహించరే !

ఒకడుక స్థితి నొంద నీర్ష(దనదేమో మూట వోగొట్టుకు
న్నక్రియన్ మిక్కిలి యేడ్చు నింకొకడు దైన్యత్వంబునుంజెంద వే
డుకగాపండ్లికిలించుచున్ నగుచునుండున్ భ్రాతృభావంబదె
ట్లిక సంధిల్లు జగత్కుటుంబమనుమాటే స్వప్నబోగంబొకో !

ఒకడన్యాయముచేసి ముందువడు వేరొక్కండు స్వార్థియై
వికటప్రక్రియలన్ స్వదేశమునె దుర్భిక్షంబుగావించు ఘా
తుకుడింకొక్క డమాయక ప్రజల గొంతుల్నొక్కి పైకెక్కు వి
శ్వకుటుంబంబిక స్వప్నమందయిన గాంచన్ శక్యమేయెంచగన్,

అరెరే ! అక్రమవిక్రమంబున స్వలాభార్థుల్ సిరుల్మూటగ
గట్టిరి, పేదల్నిరుపేదలైరి, కలయింద్లే శ్రీలతోనిండె, న
ల్గిరి మధ్యస్థులు సాంఘికార్థిక మహాక్లేశంబులంజిక్కి, ఈ
ధరణిన్ విశ్వకుటుంబమేర్పడ సమత్వశ్రీకి చోటున్నదా !

వరకట్నాల గిరాకిహెచ్చె, పదవీవ్యామోహమారెచ్చె, సో
దరభావంబది త్రచ్చె, మానవత విధ్వంస్వంబు కావచ్చె, దు
ర్భర దారిద్ర్యము జాతినెల్ల గబళింపంజొచ్చె, సామాన్యుడీ
ధరలన్ ఢీకొనలేక చచ్చె, జనచైతన్యంబు నిద్రించెనా !

ఇలపై దీనులజూడ గుండెచెరువౌ నేమందు, చింపుళ్ళగు
డ్డల వాడెవ్వడొ డొక్కలార్చుకొని గుంటంబడ్డ ఉచ్ఛిష్ట దు
ర్మలినంబౌ కబళంబు కోసమయి పోరాటంబు సాగించి భ్ర
మ్చిలుచుండన్ శునకాలతోడ వసుధశ్రీయెంత శోభిల్లెనో !

ఫణిబల్పెక్క విషంబువర్ధిలినటుల్ పాపాత్ము దైశ్వర్య మొం
దిన దుష్టత్వము రెచ్చిపోవు, గవివృద్ధిన్జెంద క్షీరంబుహె
చ్చిన చందంబున పుణ్యవంతుడు సిరుల్జెన్నొంది వర్ధిల్లి ధా
త్రిని సత్కర్మలు సల్పుచుండువసుధశ్రేయంబు కాంక్షించుచున్,

ద్వైతగుణప్రభావ జనితంబగు స్వార్థదవానలంబు అ
ద్వైతగుణప్రవర్షిత సుధారస ధారలచే శమించు సో
భ్రాతృగుణంబు జాతికి శుభప్రదమై విలసిల్లుగాన ప్రే
మాతుర చిత్తులై సమహితార్థముగోరి శ్రమింపరే జనుల్ !

సమభావక్షేత్రమ్ముల
సమరస బీజములు నాటి సౌహార్ద్రరసం
బమృతంబటు వర్షించిన
సమహిత సస్యములు పండి జగతి సుఖించున్.

## వహ్వా!

కవికి కానియు లాభంబు కానరాదు
చింతలేమొ అనంతము లెంత సేపు
క్షణము సభలోన 'వహ్వా' యటనిన చాలు
మురిసిపోవును మేరువే దొరికినట్లు.

ఓ కవిత్వమా ! నీవే ముహూర్తమందు
వలచితవో కాని కవి నిన్ను వదలలేక
చిన్నమకు దూరమై యెంత చితికిపోయె !
పెద్దమకు దగ్గరై యెంత బెగ్గడిల్లె !

ద్వైతగుణప్రభావ జనితంబగు స్వార్థదవానలంబు అ
ద్వైతగుణప్రవర్షిత సుధారస ధారలచే శమించు సౌ
భ్రాతృగుణంబు జాతికి శుభప్రదమై విలసిల్లుగాన ప్రే
మాతుర చిత్తులై సమహితార్థముగోరి శ్రమింపరే జనుల్ !

సమభావక్షేత్రమ్ముల
సమరస బీజములు నాటి సౌహార్ద్రరసం
బమృతంబటు వర్షించిన
సమహిత సస్యములు పండి జగతి సుఖించున్.

# వహ్వా!

కవికి కానియు లాభంబు కానరాదు
చింతలేమొ అనంతము లెంత సేపు
క్షణము సభలోన 'వహ్వా' యటనిన చాలు
మురిసిపోవును మేరువే దొరికినట్లు.

ఓ కవిత్వమా ! నీవే ముహూర్తమందు
వలచితివో కాని కవి నిన్ను వదలలేక
చిన్నమకు దూరమై యెంత చితికిపోయె !
పెద్దమకు దగ్గరై యెంత బెగ్గడిల్లె !

త్రిలింగ పీఠమ్మలంకరించిన
తెలుంగుభాషా రాజ్యలక్ష్మికయి
తెలుగుతేజ మెగజిమ్మి తెలుంగుల
కలలు ఫలించెడి చెలిమికలిమికై

అమ్మపాలవలె కమ్మకమ్మగా
అమృతపానమటు తీయతీయగా
పాలవెల్లిగా తేనెజల్లుగా
ప్రవహించెడి మా తెలుగుభాషకై

సమరసభావోద్యాన వనములో
సమత చిగిర్చిన జాతికోసమై
భ్రమరము ఝుమ్మను తెనుగుతోటలో
మమత సుమించిన నీతికోసమై

సహజీవన సౌహార్ద్రసీమలో
సమసమాజ సౌభాగ్యదీవిలో
సమభావోదయ కాంతికోసమై
శ్రమ భాగ్యోదయ శాంతికోసమై

ధరాతలంబున మహాజనావళి
పరస్పరమ్మెగ పురోగమించెడి
యువచైతన్య నవోదయమునకై
నవభావైక శుభోదయమునకై

మామిడిపూచిన మధుమాంసలో
మంగళ కవితా వధుమాసంలో
ప్రసన్నమధుర ప్రశాంతజీవన
ప్రసూనములు వికసించు వేళకై

పలవరించినది మా జనత !
కలవరించినది మా నవత !

# చేతనా జ్యోతి

అశ్రుధారతో వెలిగెడు
ఆత్మాలయ దీపికా!
చూపించుము నాలోపల
గోపాలుని గోపికా!

నీలో గల గోపాలుడు
నా లోపల లేడా?
మానవుడే మాధవుడను
మాట నిజం కాదా?

ఎందెందున వెదకిన గో
విందు డందె కలడా?
ఆ మాటే నిజమైతే
అందరిలో లేడా?

అదేనిజం అదేనిజం
ఆ మాటే నిజం నిజం
అందరిలో తప్ప దేవు
డెందులేడు నిజం నిజం

మానవసేవాధర్మమె
మాధవపూజాకర్మము
సేవాధర్మ జ్యోతిని
చేతములో వెలిగించుము

దీనులకై గుండెపత్తి
దిగులుజెంది రగిలించుము
వృథా కాలిపోక ముందె
కృపాఘృతము నింపుకొనుము

మానవతా మందాకిని
తానమాడు ఓనవతా!
నినుజూచిన నాటినుండి
నిదురపోదు నాకవిత!

చేతనా జ్యోతి రగుల
జేయగదే నాలోపల
చీకటి గదిలో వెలుగుల
జిమ్మగదే నీచేతుల

ఓనవ్య త్రినేత్రమా!
ఓ భవ్య కటాక్షమా!
మత్సరమను మరునిజంపి
మంగళములు గూర్చుమా!

ఓ మానవతాంగనా!
ఓ నవ దీపాంగనా!
నీ దివ్య జ్యోత్స్నలోన
నిర్ఝరినై పొంగనా!



# మా దేశం

మా దేశం మా దేశం
మా భారత దేశం
మా దేశం కన్న మాకు
లేదు మరో స్వర్గం.

మా దేశం అంటేనే
మాకెంతో ప్రాణం
మా దేశం మట్టికూడ
మాకది బంగారం.

గంగా యమునా కృష్ణా
కావేరీ గోదావరి
గలగల మని పారుతుంటె
పులకరించు మా దేశం.

హిందూ ముస్లిం సిక్కు
యీసాయీ పారిసీ
ఒకే యింట నివసించుచు
ఏకమైన మా దేశం.

ఉదుతకైన దేశభక్తి
ఉగ్రపాలతో వచ్చును
బాలుడైన సమరంలో
కాలుడుగా మారును.

ఛత్రపతిని తలచుకొన్న
షహంషాకె హడలెత్తును
పురుషోత్తము పేరువిన్న
భువికే మై పులకించును.

దౌర్జన్యం తలయెత్తిన
తర్జని చక్రం త్రిప్పును
మూర్ఖత్వం మితి మీరిన
మూడవ కన్నె విప్పును.

క్రూర రాక్షసుల గూల్చగ
కోదండం చేదాల్చును
మొండి కౌరవుల చెండగ
గాండీవం సంధించును.

దానవ సంహారమునకు
ధరియించును శస్త్రం
మానవ కల్యాణమునకు
మన్నించును శాస్త్రం.

వినిపించును మాదేశం
విశ్వశాంతి సందేశం
విరజిమ్మును మా దేశం
విశ్వకళా విజ్ఞానం.

మంచితనం పెంచుకున్న
మా మంజుల దేశం
మానవతకు మారుపేరు
మా భారత దేశం,

మాదేశం మాదేశం
మా బంగరు దేశం
మా ప్రాణం మా మానం
మా భారత దేశం.

# అద్వైత గీతి

అన్నదమ్ములెందరైన
కన్నతల్లి ఒకటేరా!
మతం కులం వేరైనా
మాతృ దేశమొకటేరా!

పలురంగుల గోవులైన
పాలన్నీ ఒకటేరా!
దేవళాలు వేరైనా
దేవుడైతె ఒకటేరా!

సహజీవనముకై నీ
సౌదర్యము జూపరా!
సమ సమాజమునకై నీ
సౌజన్యము చాటరా!

పాలక కర్షక కార్మిక
వర్తక వర్గాదులు నీ
చతురంగబలాలు గాగ
జాతికై శ్రమించరా!

ఆర్థిక రణరంగంలో
స్వార్థపిశాచిని కాల్చర!
శ్రామిక సంగ్రామంలో
క్షామరాక్షసిని గూల్చర!

బుద్ధుడు రాముడు పుట్టిన
భూమి జనించిన వీరా!
జాతికొరకు నీతికొరకు
సర్వస్వము వీడరా!

కలం హలం కత్తి సుత్తి
కరమున ధరియించరా!
కడలిగట్టు ఉడుతవోలె
కదలి రమ్మ తమ్ముడా!

లెమ్ము లెమ్ము లేలెమ్మిక
రొమ్మువిదల్చుచు ముందుకు
నాగార్జున సాగరమటు
సాగిపొమ్మ తమ్ముడా!

## దివ్వెల నవ్వులు

నా యింటను దీపావళి! నాలో తిమిరావళి!
అమృతాంశుడు లేని నిండు! అమావాస్య తారావళి!

దివ్వెల నవ్వుల కిలకిల చువ్వల మువ్వల గలగల
కవ్వించగ నాలో నే నవ్వుకొన్న దీపావళి

మనో మందిరాన కారు మబ్బులలము కొన్న వేళ
వేడుకపడు నన్ను జూచి వెక్కిరించు దీపావళి

ఆత్మసరోవరము లోన అలరెడు కలువల మొగ్గలు
రేయి పయట జజజజ విడి పోయిన పక్షుల బుగ్గలు

నాయింటికి తోరణాలు నాలో విద్వేషణాలు
క్రొత్త క్రొత్త భూషణాలు గుండెలు పాషాణాలు

లోన చీకటుల గమ్ముచు పైన వెలుగు తెగజిమ్మెడు
నా బూటక వేషముగని నగుచున్నది దీపావళి

నరకాసుర వధతోనే నరకం పోనే లేదని
నరరూపంలో నరకుడు నాలోనే ఉన్నాడని

పదవీ వ్యామోహం నా యెదలో చెలరేగినదని
పరస్పర విరోధం నా పైనిండా ప్రాకినదని

సహనమ్మది నాలోపల దహనమ్మయి పోయినదని
సహజీవన బృందావని గహనమ్ముగ మార్చితినని

సంకుచితత్వము నామది పంకిల మొనరించినదని
సంఘ సుఖం పాటించని స్వార్థం కరుకెక్కినదని

దాపుడుతో ధరలు పెంచి దోపిడి దొరనైనానని
నాదురాశతో బ్రతుకుల నరకంగా మార్చితినని

నల్లధనాశా ధూమం నాకన్నులు కమ్మినదని
తెల్లధనం కొరకు కన్న తల్లి కడుపు కుమ్మితినని

మమతలేని సమతలేని మంచిని ప్రేమించలేని
నన్ను జూచి పక పకమని నగుచున్నది దీపావళి

ఏమిచేతు నామదిలో వ్యామోహం కొడిగట్టెను
మానవతా మందిరమును మమతలేక పడగొట్టెను.

అహంవల్ల అంధుడనై అద్దంలో చూడలేను
స్వార్థంతో సమతలేని సౌందర్యం గాంచలేను

దివ్వెలెన్ని వెలిగించిన దీపించదు ప్రేముడి!
ఓ దివ్వెల దొరసానీ ఏదీ నీ సవ్వడి?

చిత్తమనెడి ప్రమిదలోన స్నేహమనెడి ఘృతమునింపి
త్యాగమనెడి వత్తిని అను రాగముతో వెలిగింతును.

సహజీవనమునకైనా జన్మమెల్ల ధారపోతు
సమసమాజమునకైనా సర్వస్వము విరజిమ్ముదు

నిగ్గులొలుకు నీ ఎఱ్ఱని బుగ్గల ముద్దాడుకొందు
సింగారీ నీ కౌఁటకై అంగారములో దూకుదు

పీడగాడ్పు సోకకుండ తోడునీడగా నుందును
నీ వెచ్చని కౌగిలికై నే శలభమనై పోదును

కన్నీరను పన్నీటను నిన్ను పులకలెత్తింతును
నెత్తురొడ్చి గుండె ప్రమిద నింపి నింపి వెలిగింతును

నన్ను వెక్కిరించబోకె నా దివ్వెల దొరసానీ!
ఏటా ఒకసారి నా యెదలో నీ కాలిడనీ!

దివ్వెల జవరాలా! నీ నవ్వులు నా యెదలోపల
పువ్వులుగా విరబూచిన పుణ్య దినం ఈనాడే

చైతన్య జ్యోతిని నా చేతములో వెలిగించుము
జడమను తిమిరమ్మును నా యెడద నుండి తొలగించుము

చిగురింపగ జేయుము నా చిత్తములో సౌహార్దం
పరిమళింప జేయుమునా భావంలో సౌభ్రాత్రం

మానవతా కాంతివిరియు మంగళ దీపావళీ!
చీకట్లను పోకార్చుము నీకిదె మా నివాళి!

## భ్రమరగీతి

తేనుగు పూవులలోని
తేనియలుగ్రోలి మా
గుండియల నీపాట
ఘూర్ణిల్లు చుండగా —
ఝుమ్మఝుమ్మని పాడవే!
తుమ్మెదా!
కమ్మకమ్మగ పాడవే!!

ప్రేమ స్వరాలతో
ద్వేషాగ్ని చల్లార్చ
చైతన్య గీతితో
జడమునే చివురించ ॥ఝుమ్మ॥

అణ్వస్త్ర రాక్షసుల్
హడలెత్త నీశాంతి
ఝంకారమే వీర
శంఖారవమ్ముగా ॥ఝుమ్మ॥

సర్వజన కల్యాణ
సంధాయినీ కళా
విశ్వమంగళగీతి
వినిపించ గళమెత్తి ॥ఝుమ్మ॥

పేదగుండెలలోని
వేదనారోదనల
ఓదార్చు సమగీతి
ఉత్కంఠతో నేడు ॥ఝుమ్మ॥

కర్షకుల కార్మికుల
కలలల్ని పండించు
సమ భావమును పెంచు
సౌహార్ద్రమయగీతి ॥ఝుమ్మ॥

నీపాట కెరటాల
నృత్యమాడే కవిత
నిలచి మానవతతో
నెలకొల్పగా సమత ॥ఝుమ్మ॥

## భగ్నవీణ

వసుధైక కుటుంబమవి
పసిడి కలలు కనీకనీ
కొసకు గగన కుసుమమని
కోరికలను చంపుకొని—

మూగవోయినది మానవత !
మోసపోయినది మా జనత !

నేతి బీరకాయవంటి
నినాదాలు వినీవినీ
స్వాతంత్ర్యం సౌభ్రాత్రం
స్వప్నంలో భోగములని— ॥మూగ॥

సహనానికి దౌర్బల్యం
దహనానికి దండిబలం
సంధిల్లిన ఈ యుగాన
శాంతికిరణ మెక్కడిదని— ॥మూగ॥

మానవ మారణ హోమం
మానవుడే సృష్టిజేసి
మానవుడే దానవుడై
మనిషిని ద్వేషించెనని ॥మూగ॥

శివశివ : నేడవినీతికి
సిగ్గే కొదవయ్యెనని
నీతిలేని నేడు కన్న
రాతినాడె మేలని ॥మూగ॥

శ్రామికులకు పేదరికం
సోమరులకు శ్రీమంతం
భిన్నస్థితి ఖిన్నస్థితి
కెన్నాళ్లీ కన్నీళ్లని ॥మూగ॥

# మూకఘోష

ఎవరదీ ! ఎందుకలా కనిపిస్తున్నది !
ఏదో మూకబాధ వినిపిస్తున్నది !

నిర్భర నిట్టూర్పులతో
దుర్భర కవోష్ణాశ్రుకణాలతో
ఆకాశంలో దూసుకుపోయే చూపుతూపులతో
ఎటుతోచక పడికొట్టుకుంటూ
ఎదతంత్రులు తెగిపోయేలా
ఏదోమూకవీణ మ్రోయిస్తున్నది
ఏదోమూకబాధ వినిపిస్తున్నది
అదివినాలని నిక్కుచున్నవి శ్రుతులు
అదివినక చిక్కుచున్నవి ధృతులు
అది వింటేనే ఊచేస్తున్నవి యెడదలు
అది వినకనే కాచేస్తున్నవి బెడదలు

అది విశ్వైక కుటుంబినీ హృద్ఘోష
అందులో వినదిస్తున్నది విశ్వమానవభాష

అది చైతన్య వధూవిలాసహాస ప్రత్యూష
అందులో వినవస్తున్నది మహాజన సముద్రనిర్ఘోష
ఆమె మూకయోష
ఆమె వినిపిస్తున్నది విశ్వఘోష

# ఇదేనా మానవత

ఆంతరంగిక విషయం అంటూ
అంతర్విషం ఆజ్యంగా పోస్తూ
మానవ మారణహోమం సృష్టించి
మానవతను దహించటం మానుషమా ! అమానుషమా !

పక్కింటికి ఇంగలం తగిలి
భగభగ మండుతూంటే పట్టించుకోకుండా
ఆంతరంగికమంటూ ఆర్తనాదాలువింటూ
శాంతం వహించటం సహనమా ? దహనమా ?

కిరాత కీచకాధములు
దురాగత దుశ్శాసనాదులు
అమూల్య మానధనాల నపహరిస్తూంటే
సమర్థులు చక్షువులు మూసికోవటం సభ్యతా ? అసభ్యతా ?

రాక్షసత్వం వికటాట్టహాసం చేస్తున్నది
రక్తపాతం ఏరై ప్రవహిస్తున్నది
స్వార్థం స్వైరవిహారం చేస్తున్నది
జగమంతా మౌనం వహించి కూర్చున్నది !

మానవ రక్తదాహంతో దానవత రేగిపోయింది
దానవ దౌర్జన్యానికి మానవత మూగవోయింది
ఇదే నా మానవత !
ఇదే నా విశ్వమానవ సౌభ్రాత్రత !

# చైతన్య స్రవంతి

నాగార్జున సాగరమా
నవజీవన భాగ్యరమా !
దుర్భిక్షదవాగ్నులార్ప
దూకివచ్చు నిర్ఝరమా !

తథాగతుని బోధామృత
ధారాకాసారమా !
కర్షక నయనాలగురియు
హర్ష బాష్ప పూరమా !

శాంతి సౌఖ్యములగూర్చెడి
సౌజన్య తరంగమా !
మాలోగల మత్సరమను
మంటలు చల్లార్చుమా !

క్షేత్రసీమ ప్రవహించెడి
చేతనా ప్రవాహమా !
మాలోగల మాంద్యమనెడి
మలినము క్షాళించుమా !

# చిగురించును జడహృదయం

నా చికటి గదిలోపల
నవరస కవితా వధూటి
చిరునవ్వొలకించగనే
చిగురించును జడహృదయం

నా జీవిత సమరంలో
నవయువతా ప్రియవధూటి
ప్రణయాశ్రులు చిందగనే
ప్రవహించును రసహృదయం

నా భావాకాశంలో
నవతా సమతా వధూటి
కడగంటను జూడగనే
కదలెత్తును జనహృదయం

నా ఆవేదనలో మా
నవతా మమతా వధూటి
కనులు చెమ్మగించగనే
కరగు శిలాహృదయం.

# ప్రజాప్రవాహం

కదిలిందీ కదిలిందీ
ప్రజాప్రవాహం కదిలిందీ !
భుజం తట్టుచూ ధ్వజం మీటుచూ
ప్రజాప్రవాహం కదిలిందీ !

నిప్పును గుప్పిట గప్పగ జూచే
నిజాయితీని ఖూనీచేసే
నీతిని జాతిని మూతులు బిగించి
నూతిని గోతిని ద్రోయగజూచే
రాతిని మించిన పాతకిపై
స్వార్థప్రేత కిరాతకిపై
శాంతిశ్రేయ విఘాతకిపై ॥కదిలిందీ॥

సుడిగాడ్పులవడి పెడతాకిడిలో
జడధి జనించిన బడబాగ్నులలో
ప్రళయంలో దుర్విలయంలో
చెలరేగిన విధివలయంలో
విలవిలబోవుచు గడగడలాడుచు
బలియైపోయిన ఆపన్నులకై
గలగలపొంగుచు జలజలపారుచు
సెలయేళ్లయి నిండిన గుండెలతో ॥కదిలిందీ॥

మంచిని పెంచుచు చెడ్డను త్రుంచుచు
మానవత్వమును మరి ప్రేమించుచు
సౌజన్యంతో సౌదర్యంతో
సమైక్యభావ సుధాధారలతో
జయజయ పెట్టుచు సమతాలక్ష్మికి
జయాభిషేకము లొనరించుటకై
కదిలిందీ కదిలిందీ
ప్రజాప్రవాహం కదిలిందీ!

## మా జండా

గగనాన విహరించుమా! మా జెండ!
జగమునే మురిపించుమా!

అమరవీరుల రక్త - మంటి ఎరుపై మెరయ
తల్లి చనుబాలంటి - ధవళమై తళుకార
పైరుసిరి చలువతో - పచ్చనై తనరార
ధర్మచక్రము మాతృ - ధాత్రి రక్షించగా ॥గ॥

స్వాతంత్ర్య సమరాన - సత్య కవచము దాల్చి
అణువాయుధుల నహిం - సాయుధమ్మున గూల్చి
శాంతి సందేశమ్ము - జగమంత చాటుచును
మంగళము పాడుచును - మానవత నాటుచును ॥గ॥

నీ నీడలో మేము - నివసించుచున్నాము
నీ మేడలో మేము - నెగడు చున్నాము
నీవె మా ప్రాణమ్మ - నీవె మా మానమ్మ
నీ కొరకు నిఖిలమ్మ - నిరసించెదము మేము ॥గ॥

నీవె మా ఏకైక - దైవమని తలిచాము
నీ ముందు తలవంచి - కైమోడ్చెదము మేము
ధరణికే కైదండ - ధర్మ చక్రపు జెండ
మానవతకే అండ - మా భరత జెండా ॥గ॥

# అమరస్మృతి

నిన్ను మరువలేము మహా - నీయ లాల్ బహదూర్ !
నీ అమరస్మృతి యుగాల - నిలచు నీకు మా జోహార్ !
జై జవాన్ జై కిసాన్ - జయనినాదమిచ్చినావు
జాతిని మేల్కొల్పినావు - ఖ్యాతిని నిలబెట్టినావు ॥నిన్ను॥
ధర్మయుద్ధమందు నీవు - ధనుంజయుడవైనావు
వీరగాథ విశ్వమంత - మారుమ్రోగజేసినావు ॥నిన్ను॥
శాంతిగీతి తాష్కెంటున - శ్రావ్యముగా పాడినావు
అణ్వస్త్రదవాగ్నులారు - అమృతము కురిపించినావు ॥నిన్ను॥
నీతికొరకు జాతికొరకు - నీసుఖ మెరజేసినావు
ప్రాణాలను శాంతికొరకు - శభిరా ! బలిజేసినావు ॥నిన్ను॥
మాతృదేశ గౌరవాభి - మానధనము రక్షించిన
మరపురాని మహానేత ! మా ప్రియతమ నేతా ! ॥నిన్ను॥

# మహానేత

జయభారత నేతా మా
ప్రియభారత నేతా!
జోహారులు జోహారులు
జవహరులాల్ నేతా!

నీ ముద్దుల కలమునుండి
నీ తీయని గళమునుండి
గులాబీల పరిమళమ్ము
గుబాళించె జగమెల్లను! ॥జయ॥

సహజీవన నవజీవన
సమతాజనతాభిమత
మ్మని అద్వైతమ్ములోని
అర్థమెరిగి నడచినావు

దేశానికి సర్వస్వము
దివికెత్తిన మహాదాత!
మహీప్రజా పారిజాత
మా జవహరు నేతా!

విశ్వజన సుఖప్రదాత
విశ్వశాంతి దూతా!
నీ దివ్యస్మృతి యుగాల
నిలచు మహానేతా! ॥జయ॥

# వీరశంఖం

వీరశంఖమూదరా ! భారతీయసోదరా !
వెండికోట గండిపడెర ! గుండె లడ్డుపెట్టరా !

అన్నదమ్ము లెందరైన - కన్నతల్లి ఒకటేరా !
కులమతభేదాలు మరచి - కలసి కదంత్రొక్కరా !

మాతృభూమివంటి తల్లి - మహిలోపల లేదురా !
కడుపారగ కన్నతల్లి - కన్నీళ్లను తుడచరా !

జన్మభూమి కన్నమిన్న - స్వర్గసీమ లేదురా !
స్వాతంత్ర్యంకన్న మిన్న - సౌభాగ్యం లేదురా !

నీ ప్రచండపౌరుషమ్ము - బడబానలమై జ్వలించు
నీ అఖండశక్తి మహా - ప్రవాహాల నిరోధించు

నీ గుండెల రక్తధార - నిండు మాతృభక్తిధార !
నీ సమైక్యభావధార - నీ అరిపై అగ్నిధార !

స్వాతంత్ర్యరణమ్ములో - శౌర్యము చూపింతరా !
మాతృదేశ రక్షణకై - శత్రువు నెదిరించరా ! ॥వీర॥

# వీరగీతి

భారతీయుడా ! ఓ భారతీయుడా !
దురమ్ములో కిరీటివై - దురాక్రమించు వానిపై
పరాక్రమించరా ! పరాక్రమించరా !

పరాయిసేన భారతిన్ - పరాభవింపనెంచెరా !
ఫిరంగివై విరోధిపై - బిరాన దూకరా ! ॥భా॥

భారతీయపౌరుషస్ర - వంతి పొంగులెత్తగా
దురాగతాల దూరగా - దురమ్ము సేయరా ? ॥భా॥

పురారివై మురారివై - విరోధులన్ విరోధులన్
దురాత్ములన్ కిరాతులన్ - దురీన ద్రుంపరా ! ॥భా॥

అవక్రవిక్రమంబుతో - అధర్మమడచివైచి ఈ
ధరిత్రి నీ పవిత్రమౌ - చరిత్ర నిల్పరా ! ॥భా॥

స్వరాజ్యరక్షణార్థమై - నరాలరక్తధారతో
వీరాళరాసులీయగా - పురోగమించరా ! ॥భా॥

# భావతరంగాలు

పవ్వుడివద్ద పవిత్రబంధ
ములు తెగునాడెదలు రెండు
గంగా జమునా నదులై
పొంగిపొంగి పొరలుచుండు

మిత్రిమేకము ప్రియతమములను
మ్రింగినపుడు కలచబడ్డ
గుండె చెరువు కట్టలుదెగి
నిండినిండి పారుచుండు

ప్రభు దివ్యపదాబ్జయుగళి
కభిషేకం బొనరింపగ
కన్నీరే పన్నీరయి
కన్నులు కడలెత్తుచుండు

సమభావ క్షేత్రమ్ముల
సౌహార్దం సౌభ్రాత్రం
పేదజనమ్ముల కొరకై
గోదారై పారుచుండు

# కరుణాగీతి

వర్షింపుము వర్షింపుము
వరుణా నీ కరుణ
శరణంటిమి వర్షింపుము
కరుణామృత భరణా ! ॥వ॥

ఆకాశమువంక జూచి
అకటా ! కన్నీళ్లునించు
కర్షకజన సంఘంబుల
హర్షింపగ వర్షింపుము ॥వ॥

కసవులేక నోరులేని
పశుగణమంబరము జూచి
అంబా ! యని అరవసాగె
అంబోదా ! వర్షింపుము ॥వ॥

ధరలు మింటినంటబెరిగె
కరువు మంటలంటుకొనియె
జలదా ! ఇక జాగేటికి
జలజలమని వర్షింపుము ॥వ॥

ఘాతుకియై చెలరేగిన
కాటకమను పెనురక్కసి
గడగడమని కంపింపగ
గర్జింపుచు వర్షింపుము ॥వ॥

# వరుణగీతి

నల్లనల్లని వరుణదేవా !
ఝల్లుఝల్లున కురియరావా !

మత్తేభమునుబోలు మందగమనముతోడ
సంబరముతో విశాలాంబరముపై దిరుగు ॥నల్ల॥

ఖామరాక్షసిగుండె ఝల్లుమని దిగజార
గంభీరకంఠమున గర్జనలు సేయుచును ॥నల్ల॥

ధరణిమైపులకించ కరుణామృతము గురిసి
కరువు మంటలనార్పి తెరువుజూపించగను ॥నల్ల॥

చక్రహస్తునిమేని శ్యామవర్ణమునీది
ఈవిగుణమందు నీ కీడుగల వారేది ? ॥నల్ల॥

దివినుండి దిగివచ్చి భువిమీది జీవులను
దీవించు నీబోటి దేవుడెవడోయీ ! ॥నల్ల॥

# నెచ్చెలి

దూరాన పయనించు - ఒంటరికి జంటగా
నా వెంట చనుదెంచు - నాచెలీ! నెచ్చెలీ!

నాకు తోడువు నీవెగా - నెచ్చెలీ!
నాకు నీడవు నీవెగా—

నాగుండె కొండపై - నవభావ మేఘాల
ముచ్చటగ విహరించు - మురిపెంపు నెచ్చెలీ!

నాకు జాబిలినీవెగా - నెచ్చెలీ!
నాకు వెన్నెల నీవెగా—

నా హృదయవీణపై - నవగాన మాధురీ
అహరిపై నర్తించు - రసరాగవల్లీ!

నాకు ప్రణవం నీవెగా - నెచ్చెలీ!
నాకు ప్రాణం నీవెగా—

నామదిని నివసించు - నాయెదను కదలించు
నన్ను మైమరపించు - నాహృదయమల్లీ!

నాకు రాణివి నీవెగా - నెచ్చెలీ!
నాకు వాణివి నీవెగా—

## రసమయి

రసవృష్టివర్షింపవే! రసమయీ!
రసికులను హర్షింపవే!
రసమయి వాక్సుధా రసమయి రసికాళి
నుసికొల్పు హృదయాబ్జ రసమయి రసమయీ!
సంగీతసాహిత్య సరసనృత్యాభినయ
చతురంగ కళలతో జగమునే కదలించ ॥రస॥
సాహిత్య జలధిలో సంగీత లహరివై
లహరివై నర్తించు లలితమయూరివై ॥రస॥
రసమయీ! మాహృదయ రాగమయి! వాఙ్మయీ!
నిసిలోని బ్రతుకుపై ప్రసరించు కిరణమై
రసవృష్టి కురిపించవే! రసమయీ!
రసికులను మురిపించవే!

## గులాబీపువ్వు

అధరమెరుపని దాని ముద్దాడుచుంద్రు
నల్లనైనంతనే మమ్ము నలుపుచుంద్రు
చూడు దేదిమధురమని చూచుకములు
జన్మమెత్తిన వీ గులాబ్జాములయి

# కృష్ణ

కడలెత్తి ప్రవహింపవే! కృష్ణమ్మ!
కడగంట మము జూడవే!

ఎడద పొంగారగా మడుగు బంగారుగా—
కడలి కూతురు మమ్ము కడగంట చూడగా—

వడివడిగ మామడుల అడుగులిడి నీ పసిడి
కడియాల సవ్వడుల యెడద వడినింపగా ॥కడ॥

నాగార్జునాచార్య నవభావకల్పనకు
నాకధుని దిగివచ్చెనో! నవ్యాంధ్ర-లోక మేనాకమగునో!

కలముతో హలముతో తెలుగు భూములు పండ
కలిమితో చెలిమితో తెలుగు గుండెలు నిండ

కర్షకుల హర్షింప కార్మికుల మురిపింప
కుడియెడమ హస్తాల కోట్లరాసులు నింప ॥కడ॥

శుద్ధమౌ నీ మనసు అద్దమై కనుపించ
నింగి నీలో చూడ నీలమైతివి గాక!

భువిమీద దివిగంగ పొంగుచున్నదటంచు
నింగి నీలో దాగి తొంగి చూచునదేమొ!

కాటకపు కొడినెల్ల కడిగివేయుటవల్ల
నిలువెల్ల నీవకట! నీలమైతివిగాదె!

ఏ అందమును చూచి - నీ ఒడ్డుపై నిలచి
నినుజూచి నింగిగా—నింగి నినుగా భ్రమసి

నింగియే దిగివచ్చి నేలపై నిలచెనా
లోకమే ఈనాడు నాకమై పోయెనా !

అని మదిని తలపోసి ప్రణమిల్లి పొగడితిని
ఇది బుద్ధశిష్యాళి పదధూళిభాగ్యమని

సుజల ప్రవాహినీ ! సుఫలప్రదాయినీ !
సర్వజన కల్యాణి ! శాంతి ప్రమోదినీ !

అవనీ సుఖమ్ముకై అమృతాబ్ధి పొంగినటు
కడలి కూతురు కటాక్షము ధరణి కురిసినటు

భీమేశ్వరుని మహా తామ్రజూటమునుండి
దూకి ప్రవహించు మందాకినీ లహరివై

ప్రేమప్రవాహాన క్షామాగ్ని చల్లార్ప
లక్షలాది జనాళి రక్షించి పోషింప

బీడులే ఫలియింప ప్రోడులేయిగురింప
బంగారు కలలన్ని రంగారి పండింప

కర్షకుల హర్షింప గలగల ధ్వనులతో
జగములను మురిపింప జలజల శ్రుతులతో

పొంగారు గంగా తరంగ ప్రవాహినీ
సంగీత జనితమౌ మంగళ ధ్వనులతో

కరుణాంతరంగ నిర్ఝరిణీతరంగ సుం
దర హృదయమాధురీ మురళీరవమ్ముతో

వీనులకు విందుగా తేనియల సోనగా
నవమాధురీగాన రవళితో మామదుల

పొంగార ప్రవహింపవే ! కృష్ణమ్మ !
బంగారు పండింపవే ! —